తకమ్మును నోటఁగఱచికొని యేగుటయుఁ దదరణ్యనివాసి జాంబ
వంతుం డల హర్యక్షమును వధించి యామణిని సంగ్రహించి తా వ
సించు గుహాలోని సౌధమ్మునం దుయ్యేలకు నలంకారంబుగాఁ గట్టె
ననంతరంబు సత్రాజిత్తు. 25

మ. తనతమ్ముఁ డా వధియించి కృష్ణుఁడు స్యమంతమ్మున్ హరింపఁ బో
లునటంచు న్నిజమెంచ కచ్చటచటన్ లోకంబుతోపాటు వా
నినిగాఁ గృష్ణుఁదలంచియాడు కతనన్ శ్రీకృష్ణ దేవుండు తా
విని యెట్లోయిది వాపికొంటయనుచున్ వేమాఱుచింతించుచున్. 26

వ. అప్రసేనుఁదేగిన యదణ్యంబునకుంజని జాడలుదీయానంత నచ్చట
జాంబవంతుండు వసించు గుహాలోనికిఁబోయి చూతమను నిచ్చ
వొడమె ననంతరంబు. 27

ఉ. అగుహాలోని కేగుటయు నత్యధికంబుగనుండె ధ్వాంత మె
ట్లో గుహచాలధాగము మహోజ్జ్వలతేజుఁ దతిక్రమింప న
చ్చోఁ గనుపట్టెసౌధ, మదిచూచియె తీరవలెన్ బ్రపంచపున్
లోఁగిళులేవియేనియును లొచ్చుగఁగన్పడు దానిముందటన్. 28

వ. అత్యాశ్చర్యపర్యాకుల చిత్తుండై యాసౌధంబు ప్రవేశించుటయు
నందొక్కచోట. 29

ఉ. చందనగంధి నీలకచ చంపక నాసికయుత్పలాక్షి యిం
దిందిరదృక్కలాప స్మరదేవువిలాసపుఁ బుంజమో! యనం
గం దగుబోటి కన్పడియెఁ గాంచనచేలన, కాలతాంగిపై
డెందముపర్వెనాపెకును డెందముపర్వెరమాధినాధుపై. 30

వ. అక్కన్నియ యెట్టకేలకుఁ దనమనోవికారంబు బయల్పడకుండ
నాఁగికొని శ్రీకృష్ణు నోరచూపులం జూచుచుఁ దన తమ్ముఁడున్న
యుయ్యేల నూఁపుచు మిన్నకుండె. 31

తే. గీ. చారుహాసినియగు నల్లజాంబవతిని,
గాంచికృష్ణుండు దరహాసకాంచదాస్యుఁ
డగుచుఁ దొట్టెలోనుండిన యర్భకుని గు
ఱించి యిట్టులువచియించె నంచితముగ. 32

చ. రతనముదాల్చిగ్రీవను దురంగమునెక్కి ప్రసేనుఁడింపురా:
హతునొనరించి వానిని మృగాధిపుఁ డీమణిసంగ్రహించె సు
ద్ధతుఁడల భల్లుకేశ్వరుఁడనంతరమా హరిఁజంపిసీటు స
ర్పిత మొనరించె రత్నమిది వేడుకనాడికొనంగ బాలకా! 33

తే. గీ. అడికొను మేడువరు మంచు యాదవకుల
భూషణుఁడు కృష్ణుఁ డమ్మణి పుణికి పుచ్చి
కొనఁగ జాంబవతీసతి కొనకు మిచ్చు
భల్లపతి విన్నపైఁపడు పదు పువలికి. 34

కం. అధవా! రత్నముగొన్నను
గ్రుధమై ఋక్షపతి బాహుబల రుద్రుఁడునిజ
వధియింపకమును చను మవి
తథబలుఁడెఱుఁగవొకొ? మాదుతాతన్ సుభగా. 35

చ. అని యెలనవ్వ నెమ్మొగమునందు విలాసములెన్నియో పొరిన్
బనుపడఁజేయ నయ్యతివ పల్కుటకున్ జిఱునవ్వ నవ్వి చ
య్యన యదునందనుండు గుహయంతప్రతిధ్వనులీన శంఖమొ
త్తిన విని జాంబవంతుఁడొగి దేవకి సూనుని దాఁకె వీఁకమై. 36

వ. అట్లు తాఁకి యా యగాధంబగు గుహాగర్భంబున విరువురు నొకరి
కొకరు తీసిపోక పెనంగుచుండిరి. ఈ విధమ్మున నేడు దినంబులు
కడచినమీఁద గృష్ణుం డరిగిన మఱునాఁటనుండి బలదేవాదు లాయర
ణ్యంబెల్లెడ వెదకి వెదకి యెచ్చటను జాడదెలియమిని మృతుండై
యుండుననియు నేఘోరమృగంబులో భక్షించుటంజేసి యేవిధమైన

గుఱుతును గానరాకున్నది యనియు నిశ్చయించికొని యౌర్ధ్వదైహి కంబులకు సయిత ముపక్రమించి జరిగించుచుండిరి. పిడుగువంటి యీ వార్తను విని హస్తిపురినుండి పాండవులును ధార్తరాష్ట్రులును వచ్చి పరామర్శించి మరల వారివారి పొందుపట్లకుఁ జనిరి యంత నిరువది యొకటవ దినంబున. 37

ఆ. వె. జాంబవంతు నొదలి సత్త్వంబు శౌరి స
త్త్వమ్మునకు నొకింత తగ్గిపోరు
భరముగాఁగఁ దోచి ప్రాజ్ఞుండతండు వి
జ్ఞానదృష్టి కలిమిఁ గాంచె నిట్లు. 38

కం. ఇతఁడు మహావిష్ణువు ప్రా
కృతపురుషుఁడుగాఁడు పూర్వమేనల రామా
వతరస్థున్ సేవించితి
నతఁడే యితఁడెందు సంశయములేదనుచున్. 39

వ. నిశ్చయించికొని మహానుభావా! నేను త్రేతాయుగంబు నాఁటివాఁడను, నీవు ద్వాపరపురుషుండవు. నాతో నిరువదియొక్క దినమ్ములు పిడు తీకపోరుటయకాక యిఁక నీతోఁబోరుట భరంబనిపింపఁజేసితివి. 40

తే. గీ. నాఁడు నన్ను హనూమంతు నలుగవయుని
సూర్యపుత్రునేలిన మధుసూదనాంశ
మెఱుకగదిరె క్షమింపుమీ వెందుకిటకు
వచ్చితివొ? తెల్పుమని నమోవాకమిడగ. 41

వ. శ్రీకృష్ణుండాపరమభక్తుని యొడలినొప్పులు దీరునట్లు తన యభయ హస్తమ్ముతో నిమిరి యా భక్తత్రాణపరాయణుండు జాంబవంతునితో నిట్లువచించె. 42

కం. కనవో! సత్రాజిత్తును
దినమణికిఁదపించి యల్లదేవునికృపఁ జే

కొనియె స్యమంతకమది నీ
తనయుని యుయ్యాలకడకుఁ దాఁ జనుదెంచెఁ. 43

వ. విషయమిటులుండ నేను లోభమ్మువలఁజేసి తనసత్యుఁని వధియించి యీరత్నంబు నపహరించితినని యతఁడు నాపై నిరపనించి నొవటి మోఁపెనని వెండియు. 44

కం. అతఁడొకఁడె యైనచో నా
మతి గింజిరి పడదు సర్వపుసుజాయినాపై
నతుకఁదొడంగిరటులె సూ
నృతముంగనిపెట్టి యాడుబెందుంగలదే. 45

వ. అని వెండియు. 46

ఆ. వె. తగినవారిలోనఁ దలయెత్తి బ్రతికెడి
మానిసుల కబద్ధమైన దురప
వాదమోర్వనెట్లు వచ్చెడి భల్లూక
రాజ! దాని కైకరంబు గుంది. 47

వ. యధార్థంబు తెలిసికొని బంధులోకంబునకు బోధింపనెంచి యీయడవికి వచ్చి నీగుహం బ్రవేశించితి. నీ వీరత్నంబును సంగ్రహించి భద్రపఱచుటంజేసి నాకుఁ బరిమోపకారం బొనర్చితివని వెండియు.

కం. పడికన్నఁ జావు మేలని
యెడి లోకోక్తి వినియుందు వీనాకీవి
ప్పుడు చేసిన యుపకారము
నుడుల కతీతంబు నిన్ను నుతియింతునెటుల్. 48

వ. ఇట్లు నుతియించు శ్రీకృష్ణుని వచనంబులకుఁ జాల నొచ్చికొని దేవా! చరణదాసుండనగు నాయెడల మీరిట్టి వాక్యమ్ము లుపయోగించుట నన్నుఁ జిన్నంబుచ్చుటయె యగు. నాయందు మీకు నమగ్రహంబు కలుగుట విక్కమయేని. 50

కం. కొమిరె యదె విన్నుఁగదుఁ బ్రే
మమునం దిలకించు నను మన్నించుటకై
ఏమములలో నొకరమణిగ
రమారమణ! చేకొనుమని ప్రార్థింతుహరీ. 51

వ. ఇట్లనుగ్రహించినచో నీవు నాసామివి మాత్రమకాక చతుర్దశ భువ
నంబులకు నధినేతవు కదా! అట్టి నీతోఁ బళువునగుటంజేసి సంగ
రమ్మునకుం దొడరిన యపరాధం బుపశమించుటయకాదు. 52

ఉ. పెండిలి యీడుదాఁటి తగుప్రేముడికాని వరింపనున్న యీ
యండజయానకున్ దగిన యల్లుని నెక్కడఁ బెత్తు నేను మూ
ర్ఖుండఁ బళుత్వదుర్భగుఁడఁ గూఁతురు మాద్రుళురాలుకాదు నీ
యండకుఁ దగ్గదిట్టులు దయంగ గనఁజేయుముకృష్ణ! నాయెడన్. 53

తే. గీ. అంధకారబంధురముగునట్టి యీమ
హా గుహాంతరమున సౌధమొంచు నొకటి
గట్టి కాపురమున్న నాపట్టి కీవు
దక్క వరియింపఁదగినట్టి దయితుఁడున్నె! 54

కం. "ఇందుఁగలఁడందులేఁ డని
సందియమెవ్వని గుఱించి జనులొందరో! ఆ
బృందారకమూర్తివి నా
నందనిపాణిఁగ గ్రహించి నను మనుపుమఁజా!

వ. అని కొమిరెచే నమస్కరింపఁజేసి "తదేవలగ్నం" మను సూక్తిం
బఠించి పాణిగ్రహణంబు నిర్వర్తింపఁజేసి పారిబర్హంబొసంగి
కూఁతుతో నల్లునితో ద్వారకాపురంబు ప్రవేశించునప్పటి దృశ్యంబు
వర్ణనాతీతంబై యొప్పె. 56

కం. నమనెననుకొన్న కృష్ణుఁడు
రమణీమణిమణియుఁగొని కరంబు ముదము పూ:

ప్రమదలకు బంధువులకును
నమరించెఁగా భార్యలకును నచ్చెరువొదవన్. 57

వ. పదంపడి స్యమంతకమణిని బంధువులకెల్లరకును జూపి సత్రాజిత్తు నకు వారలెల్లరుఁ జూచుచుండ నొసంగె. లజ్జావనతముఖుండై యతండద్దాని గ్రహించి యమ్మణి నెట్లేని కృష్ణునకొసంగ నెంచెం గాని మున్ను తానొనర్చిన యపనిందనుబట్టి పరిగ్రహింపఁడని యెంచి యుపాయంబుచేసి తన కూఁతు నుత్తమలక్షణోపేతను భార్యగాఁ గయికోవలయునని ప్రార్థించుటయు శ్రీకృష్ణుండందుల కంగీకరించెఁ బదంపడి యాదవులలో శతధన్వుఁడు నక్రూరుండు లోనగువారలెట్లేని యీమణి నపహరించు తలంపు గల్గియుఁ గృష్ణుని వలనిభయము కతన సమయంబు నిరీక్షించుచుండిరి. పదంపడి. 58

తే. గీ. పాండవులఁ జూడనేగెఁ గృష్ణుండు రాజ
కార్యవశమున నాతఁడక్కడనయుండె
నట్టితఱి శతధన్వుండు పట్టుబట్టి
చంపి సత్రాజితుని మణి సంగ్రహించె. 59

వ. ఈ ఘోరకృత్యంబు జరిగిన కొన్నాళ్ళకుఁ గృష్ణుండు ద్వారక కేతెంచిన సత్యభామ యావద్వృత్తాంతమ్మును నశ్రుపూర్ణమ్ములగు నేత్రమ్ములతో గద్గదస్వరాకులయై వచించుటయు. 60

ఆ. వె. కపటనాటకుండు గావునఁ గృష్ణుండు
మదిని సంతసించి మామఁ జంపి
నట్టి క్రూరుఁ జంపుమని సత్య నలరింప
నన్నతోడఁ జెప్పె నతఁడు పిదప. 61

వ. శతధన్వ వధింపఁబోవుతఱి నతండు స్యమంతకమణిని దాఁపుమని యక్రూరున కిచ్చి తాను జవంబుగల యశ్వమ్ము నెక్కి పలాయనం బొనరించె నట్టియెడ. 62

ఉ. ఎక్కడికేగె దీవు మణినెత్తుక భూమియకాదు స్వర్గమం
దెక్కడనున్న నిన్ను వధియింతు మణిన్ గయికొందునంచుఁ బే
రుక్కున సీరపాణి రథమొక్కటి నెక్కటి నెక్కి యేగెనే
దిక్కున యాదవుండరిగె దృష్టి యటే ప్రసరింపఁ జేయుచున్. 63

ఆ. వె. అన్నతోడఁ జెప్పి యతఁ డేగుచుండఁగాఁ
దానుగూడ నొకరథంబు నెక్కి
యన్నకన్నఁ గడురయమ్మున శతధన్వుఁ
దఱుమఁజొచ్చె నోలి దరధరుండు. 64

వ. శతధన్వుండెక్కిన యశ్వరాజంబు మహోత్తమజవోపేతంబగుటం
జేసి శతయోజనంబులఁ దనుకఁ బ్రయాణంబు సాగించి యశనా
యాకులితంబై మార్గాయాసమ్మున మడియుటయు వాఁడు గత్యంత
రమ్ములేక పదాతియై కొంతవడి పలాయనం బొనర్చి తుదసఁ దన
యశ్వంబు చూపిన తెఱంగున మడిసె. ననంతరం బచ్చటికి వచ్చి
విగతప్రాణుండై పడియున్న శతధన్వు కట్టిన పుట్టంబుల నెంత
వెదకినను స్యమంతకం బక్రూరున కిచ్చిన కతన నితనియొద్ద గోచ
రింపదయ్యె నంత బలదేవుండు. 65

కం. తమ్ముని తాత్పర్యము మణిఁ
దెమ్మనియున్ గూడ నుండె దేవేరి గదా!
తమ్మునికి సత్య? యమ్మణి
యమ్మహిళకు హక్కు తండ్రిదగు హేతువునన్. 66

వ. అట్టిస్థితిలో నేను జంపకున్నను వీఁడు నావలన భయంబునం జేసి
శక్తికిమించిన పలాయనంబొనర్చి విగతజీవుండయ్యె. నీపలాయన
సంభ్రమంబున మణియెక్కడనేని పడియుండనోపునని యెంచి
ద్వారకకున్ జనుదెంచుచుండఁ గృష్ణుండు మధ్యమార్గంబున నన్నం

గలిసికొని యన్నతో నీకన్న మున్న నేను శతధన్వుం బరీక్షించితి ననియు మణివానియొద్ద లేదనియున్ జెప్పుటయు నమూయికుఁ గగు బలదేవుండు, కృష్ణుండు శతధన్వునిమణి నిమిత్తమ్ముగఁ జంపి, మణిని గ్రహించి డాఁచియిట్లు కపటోక్తులు పలుకుచుంటెనని తలంచి రోషారుణనేత్రుండై యిట్లు దూషింపఁ దొడంగె. 67

కం. ధనమే ప్రధానముగ నీ
వనువర్తించెదవు వీనినందులకే చం
పినయట్లులయ్యె మనభయ
మునసేకాకెట్లు చచ్చుఁ బొరిఁబరుగిడుచున్. 68

ఆ. వె. మామఁజంపినట్టి మలినుండు వీఁడని
చంపితేని సరియె సత్యదూర
మైనమార్గమేల; యమ్మణి నెచటనో;
డాఁచిబొంకు టక్కటా! హితంబె. 69

వ. ఇట్లు బలదేవుండు కృష్ణుని దూఱుటయు నతండెన్నియో యొట్లును సత్యములును నెఱపి యన్నకు యథార్థంబు దెలుపనుంకించెగాని బల వత్తరంబగు వేఱొండు కారణంబుంటంజేసి బలదేవునకా యథార్థోక్తులు లేశమ్మును మదికి నెక్కవయ్యె. 70

కం. పదపడి కృష్ణునివైఖరి
మదికిన్నచ్చని కతానమనము విఱిగి కో
విదమాన్యుడు బలదేవుఁడు
విదర్భదేశమున కరిగె విడిచిపురంబున్. 71

వ. కృష్ణుండొక్కండ ద్వారకకువచ్చె. బలదేవుండు రాకపోవుటంజేసి పౌరులిట్టు లపవదింపఁ దొడంగిరి. 72

కం. ఇరువురకున్ మణికై సో
దరులకు వైరమ్ము పొసఁగి దఱఁడుకృష్ణుం

దఱిముఱిఁబొమ్మననగ్రజుఁ
డరిగెననఁచుఁ జెప్పికొనుట హరికిం దెలిసెన్. 73

ఆ. వె. తెలిసియకట ? యెట్టికలియిది యపవాద
మీఁద మఱియొకండు మేకొనంగఁ
దొడఁగె దీనికేదొ దోసముండియె తీర
వలయునెట్లు దానిఁ దెలిసికొందు. 74

వ. శ్రీకృష్ణుండు భగవదవతారం బయ్యు మనుష్య భావం బాశ్రయించి యున్న కతన తదనుగుణం బగు భావంబు ననుభవించుచుండె. నక్రూరుండు శతధన్వుండు దాఁపనిచ్చిన మణింగొని కాశీపురంబు ప్రవేశించి తన్మణి ప్రసాదంబున ననుదినంబును బ్రవృద్ధం బగు నైశ్వర్యమ్మునం జేసి మహేశ్వరుని యాగంబులచే సంతుష్టుం గావించుచు సుఖంబుండె నాయీ సందర్భమ్ములెల్లఁ గృష్ణునకుఁ దెలియవలసి యున్నను దెలియరామికిఁ గతంబు మున్న వివరింపంబడియెఁ బదంపడి కథను వినుండని సూతుండిట్లు చెప్పఁదొడంగె. 75

కం. అపవాదమీఁద నొండొక
యపవాదము మొగిసి తనదునాత్మకుఁ జింతం
గృపణతఁ గూర్పఁగ బాధా
చపలుండై కృష్ణుఁడున్న సమయమునందున్. 76

వ. నారదుం డరుగుదెంచుటయు నమ్మహాత్ముని యథోక్తప్రకారంబునఁ బూజించి సుఖోపవిష్టుం గావించిన యనంతరంబున నారదుండు కృష్ణువాననంబు దిలకించి. 77

కం. ఆనందో బ్రహ్మశ్రుతి
యేనిత్యవచించు నతఁడవీవయ్యును నీ
యాననమువిన్నఁ బోపు ని
దానంబెయ్యదియొ ? నాకు దాపక చెపుమా. 7

కం. సేమమకద? బందుగులకు
నీమహిళలకుఁ యశంబునిర్నిద్రమకా!
యేమూలమ్మున నెవ్వగ
నీమది గలగుండువెట్టె నే వినవెంఁతున్. 79

వ. ఇట్లు గ్రుచ్చిగ్రుచ్చి యడుగు నమ్మునివరునకు శ్రీకృష్ణుఁడిట్లను. 80

చ. మునివర! యెల్లవారి మనముల్ ముకురంబున యందుఁబోలె నీ
మనమున గోచరించెడిని మన్మనమేటికి గోచరింపదో
యనఘ? యటేని మీరడిగినప్పుడు చెప్పకతీరమిఁగా మనం
బునఁగల చింతఁ దెల్పెదనమోఘ ముపాయము దీనికేదియో? 81

కం. ఒక యపవాదము పైపే
తొకయపవాదమ్ము మూఁడి యూరకనన్నుఁగా
వికలాత్ముఁ జేయుచున్నవి
యొక దోషము నేనెఱుంగనో మునిచంద్రా? 82

ఉ. ఏనుస్యమంతకమ్ము హరియించితినంచు నొకండు దానినె
ట్లైనియు నీఁగితిం, బిదప నేను మదగ్రజులేవఁగొట్టిన
ట్లైనది యమ్మహాత్ముఁడదయత్వము మైనరిగెన్ విదర్భకో
మౌనివరేణ్య! దుర్యశము మానసముఁగా గలఁగించుచున్నదెకున్. 83

కం. దోసము చేసినచోనది
పాసిచనమి నిశ్చయంబ బ్రహ్మాదులునుఁగా
దోసిలి దానికి నొగ్గుదు
రీనడికేనెట్లుపైకు నెటునను విడుచుఁగా. 84

వ. ఇందులకుంగల కతంబెట్టిదియో? యెట్టిదైన నగుంగాక దీనికినివ
ర్తనోపాయంబున్నదియో లేదో వివరింపుమని నిన్నుం బ్రార్థింతు

నావుడు నారదుండు కొండొకజ్ఞాన దృష్టిన్ దిలకించి సకలంబు నవ
గతంబొనర్చికొని యిట్లనియె. 85

తే.గీ. భాద్రపదమునఁ జవితిని బహుళమందుఁ
గాదు శుక్లమ్మునన్ శశిఁగాంచినట్టి
వారికపవాదములు వచ్చుతీరు పీవు
వినక చూచితివని మనంబునకుపచ్చె. 86

వ. అట్లు నారదుండు వలుకుటయు శ్రీకృష్ణుండు జ్ఞప్తి నభినయించి. 87

ఆ. వె. చవితినాఁట నేను సాయంసమయమందుఁ
బాలు ద్రాపునపుడు పాలయందుఁ
బ్రతిఫలించి కానఁబడియెఁ జంద్రుఁడు నాకు
నదియుఁగూడ దోసమగునొ ? యేమొ ? 88

వ. పదంపడి పచియింపు మనపుడు నారదుండు. 89

చ. చవితిని మాత్రమే జనులు చంద్రునిఁ జూచిన దోసమబ్బు హే
తువు వివరింతు విఘ్నపతి తొండపుదేవరనాఁడు పూజ్యుఁడై
కవిజనమాన్యుఁడై వలుఁ గావున నాతని కల్లనాఁడు పం
డువుగద ? అక్కృతమ్మునఁ గనుంగొను భక్తులనెల్ల నయ్యెడన్. 90

తే. గీ. అతని పూజ త్రిమూర్తులు నాచరింతు
రవిన నొడ్లు పొనర్తురంచనఁగనేల ?
భక్తజనపక్షపాతి యప్పార్వతీ కు
మారుఁడానాఁడు చనుఁ బ్రతిమందిరంబు. 91

కం. సరసిజభవు సృష్టియు నల
సరసిజలోచనుని రక్ష సర్వశుభములుఁగా
గరుపు నతవికతమువనే
నిరంతరాయముగ సాఁగు నీవెలుఁగవొకో ?? 92

తే. గీ. అబ్ధిమథియింప మొదలిడు నప్పుడతని
నాదియందుఁ బూజింపమట నాదరించు
కతమునం గాదె జనియించెఁ గంధియందు
హాలహల ముప్పతిల్లి భయంబుగొల్పె. 93

తే. గీ. బ్రహ్మ మొదలగు దైవత ప్రభువులెల్ల
నతనికంటెను దేవతలందు నగ్ర
పూజ నంగీకరించిరి భూప్రభృతి స
మస్తలోకమ్ములందిది మాన్యమయ్యె. 94

వ. తత్తచ్ఛుభకార్యమ్ములయందు వారువారు మాత్రమ పూజింతురు గాని భాద్రపదశుక్ల చతుర్థినాఁ డెల్లరును నాబాలగోపాలముగ నమ్మహితాత్ముని బూజించి యాతనికిఁ బ్రీతిపాత్రమ్ములగు నారికేళఫలమ్ములను మోదకమ్ములను సమర్పింతురు. 95

కం. ఒకయేటి చతుర్థిని గౌ
రి కుమారుఁడు చంద్రపదమరిగి యయ్యెడఁ బూ
జకులొనరించెడి పూజలు
సకలారాధ్యుండు గొనెడి సమయమునందున్. 96

వ. కడుంగడు వేగమ్ముగ నయ్యెభక్తుల గృహమ్ములకు మూషకవాహనారూఢుండై యరుగుచుఁ దిరుగుచుఁ దత్తద్భక్తులు నివేదించు మోదకంబులు భక్షించుకతన నుదాత్తంబగు జఠరంబుతో స్వతస్సిద్ధంబగు నేనిక మొగముతోఁ గొండొక వికృతంబుగ నున్న త్రిలోకారాధ్య వేదాంతవేద్య గణనాథుంగాంచి చంద్రుండు సౌందర్యగర్వితుండు కొండొక యపహసించె. 97

కం. అది విఘ్నపతికిఁ గొండొక
మదికి నసహ్యముగఁ దోఁచి మదమత్తుఁడు పి

నిదయన్ గనఁదగదని బె
ట్టిదమగు శాపమ్ముఁ దానిడియెఁ జంద్రునకున్. 98

వ. ఆ శాపస్వరూపంబు వివరింతు. 99

ఉ. అందముఁ జందముం గలుగునట్టిఁడ నేనని పొంగఁబోకుమో
చందిర ! నీకళంకమది సర్వులకున్ విదితంబ డాఁచినన్
గందదిడాఁగఁజాలని వికారమటంచెద నెంచి ! దాని పౌ
త్తుందొలఁగించి శంకరుడెదోయొకి సుంతగ్రహించె భూషగా. 100

మ. సరియే నిన్నుఁ కఁజూచువార లెవరో ? సౌందర్యమేలాటిదో
అరయంజాలెద నేను నిన్నెఁడుచంద్రా ? చూచునో ? వాఁడు దు
ర్భరమౌ నేయపవాదకో గురియగున్ బ్రహ్మదులీశాపమున్
మరలింపంగలవారలౌచు నిను మన్నంజాలినం జూచెదన్. 101

వ. అని వెండియు. 102

తే. గీ. దేహికందచందమ్ములు తృప్తికరము
లనుచు నెంచితివేమొ ! విద్యావివేక
ముఖ్యములు భూషణమ్ములిమ్ముల నెఱుంగు
మింక నేవియు, ననిచెద వెన్నటికిని. 103

వ. ఈ శాపవృత్తాంత మ్మెఱింగిన చంద్రుండు తన్నింక నెవ్వరును విదియనాఁడు "నవోనవోభవతి" శ్రుతిపాఠం బొనరించి గౌరవింప రని యెఱింగి యయ్యవమానంబునకు నలందురుచు జలంబును జొచ్చి యందలి కుముదవనంబు నివాసంబొనర్చుకొని యదృశ్యుం డగుటయు. 104

కం. సకలౌషధీప్రకాశము
వికలంబై రోగముడుపు వెజ్జులు చెడి రెం
దుకుఁ గొఱగా కమరులు తిం
దిక మొగమున్ వాచిమిగులడీల్పడిరి వగన్. 105

వ. అయీా విపత్తు దొలంగు నుపాయం బరయువారై పిలింపు పెల్లి రును బ్రహ్మాదకుఁ జని మొఱపెట్టుకొనుటయు నచ్చుతురాన నుండు. 106

చ. ఇది గణనాధుశాప మతఁడే సదుపాయము చూపఁగా వలెన్
మదమునఁ జంద్రుఁ డట్టులవమానమొనర్చి ప్రపంచకానకీ
సొదగలిగించెఁ దా నగుత ! సుందరుఁ డాగణనాధు శాస్త్రుకో
విదులు బహూకరింత్రు తను వేత్తలటుల్ యజియింత్రెఁ యెయ్యెడన్.

క. కరమును నపచారంబు బొ
నరించె నజ్ఞానమున మనఃప్రభవుఁడు తా
నెఱుఁగఁడొ ! "విద్యారూపం
విరూపిణా" మనెడినుడి వివేకమువలదే ? 108

కం. తాను గళానిధియగుఁగా
కానిఖిలేద్యునకుఁ దనకు నంతరమెంతో
లోనెఱుఁగవలదె ? గణపతి
మేనెల్లను విద్యలే యమేయుఁడతఁడగుణా. 109

తే. గీ. నావివాహంబు నలరమానాధుపెండ్లి
యింద్రుఁడాదిగఁగల విలింపేంద్రుల శుభ
కార్యము లతండకాదె ! విఘ్నములు వారయ
కుండఁ గాపాడె విశ్వాసముండవలదె ? 110

తే. గీ. అతని నారాధనము చేయనట్టి క్రతువు
గాని గృహనిర్మితియుగాని కథకు నేది
గాని తుదనెగ్గినట్టు లొక్కఁడు వచింపఁ
గలఁడె ? పూజ్యావమానంబు కట్టికుడుపు. 111

వ. ఇట్లు చతురాననుండు బహువిధంబులఁ జంద్రుం డొనర్చిన యవ
మానంబునకు నొచ్చికొని గణేశశాపంబు గణేశుండె మరలింపవల
యునని యెంచి సుపర్వసమేతంబుగ గణేశు నికటమ్మున కరిగి విను
తించినచో నతండు సుప్రసన్నుండగునని యింద్రునకు బోధించి
అట్లు చనుటకు ముందు చంద్రునిచే భాద్రపదశుద్ధ చతుర్థినాఁ డమ్మ
హాత్ము నర్చించుట కార్యసాధకం బనుటయు దేవతలు చంద్రునకు
బోధించి యట్లొనర్పఁజేసి తత్సహితంబుగఁ గైలాసంబున కరిగి
నుతించి సుప్రసన్నుం జేసికొనిన పిమ్మటఁ జంద్రుండు. 112

చ. మదమున నిన్ను నవ్వితి క్షమాపణ కోరుచునుంటి సర్వకో
విదజనమాన్య నిన్ను నవివేకి యెవండొ? యొకండు నవ్వగా
కదియుల వానియజ్ఞతకెయో గురుతంతియకాని నీకు న
య్యెద గలిగించులోపము రవంతయునుండ దెఱుంగరే! ఘనుల్.

కం. ఎఱిఁగియొ? యెఱుఁగకొ! చేసిన
పొరఁబాటు క్షమించినను విబుధజనుల దృగం
కురములకు లక్ష్యమగునటు
గరుణింపుము దేవదేవ! గణగణనాథా! 114

వ. ఇట్లు పలువిధముల సన్నుతించి క్షమాపణ వేడుకొనునంత విఘ్నే
శ్వరుండు సుప్రసన్నుండై తన యిచ్చిన శాపంబొక భాద్రపదశుద్ధ
చతుర్థికి మాత్రమే వర్తించుననియుఁ దక్కు-దినములలో యథా
పూర్వంబుగ నిన్ను నెల్లరుఁ జూడవచ్చునని శాపంబు సడలించి
వెండియు. 115

కం. అపుదేనియు నాయిడు శా
పపువిధమును దానికైన పరివర్తనమున్
విపులముఁగనున్న కథవిను
సుపుణ్యులకు నిన్నుజూచుచో లేవెగ్గుల్. 116

వ. ఇట్లు చంద్రుని నతనికి బాసటగా నేతెంచిన యింద్రాదులను గౌర
వించి విఘ్నేశ్వరుండు తన సహజకృపాళుత్వమును బ్రకటించె. 117

కం. కతవిని శిరమున నాయ
క్షతలు ధరించి శశిఁగాంచు జనులకు దోసం
బతుకదు నీపటుపేయ మి
వెతకగ్గఁబై తికతము విస్పష్టంబే. 118

తే. గీ కొలఁది దినములలోననే గలదు భాద్ర
పదపుఁగృష్ణేతర చతుర్థి భక్తి భావ
మున భజింపుము గణనాథు, ముదితుఁడగుచు
విరప వింధలు త్రుటిలోన నిన్ను విడుచు. 119

కం. నారదుఁడిటు బోధింప ర
మా రమణుఁడు కృష్ణుఁడ ట్లుమాతనయునిదా
నారాధించుటయును గన
నై రహిగణపతి వచించెనయ్యలఘునితో. 120

వ. నీవునాకుఁబొనరించిన పూజాపురస్కారములకు మచ్చిత్తంబుహెచ్చుగా
సంతసించె. నీకు వలయు వరంబు వేడికొమ్మనుటయు శ్రీకృష్ణుండు.

తే. గీ. దేవ ! నీకు నాయెడఁ గలదేని కరుణ
యీ స్యమంతకమణి కథ, యీభవచ్చ
రిత్రమును జంద్రుశాప చరిత్రమును వి
నినను నక్షతల్గొనినను నెగులులేమి. 122

వ. కరుణింపవలయునని కోరుటయు గణనాథుం డట్లగుఁగాక యని
యనుగ్రహించెనని వక్కాణించి సూతుండు. 123

కం. మునులార ! వింటిరేకద !
యనఘమ్ము గణేశ్వరుని మహత్త్వమ్ముఁ జతు

ర్థిని నతనికిఁ జేసెడి పూ
జను మణిచరితంబుఁ గలుషసంతారకముఁ గా. 124

తే. గీ. మానసికమైన కష్టమేదేని యెడతె
గనిది తారసమైన నీకథను జదివి
కొన్నచో విన్నచో శివుకొమరుఁ డట్టి
కష్టమును దొలఁగించు నిక్కమిది విన్మఁడు. 125

వ. ఈ వ్రతంబునకు సంకష్టక చతుర్థీవ్రతమను పేరుగూడ వచ్చుటకున్
గతంబు పూర్వోక్తంబయని యెఱుంగునది యని పెండియు. 126

కం. అపవాదలు దొలఁగించుఁ గా
విపులానందమ్ము నొసఁగు విఘ్నపతి వ్రతం
బెపుడేని చేయఁగానగు
నపుడిపుడను నేమమేల ? యనఘ మనీషుల్. 127

వ. ఇట్లు శౌనకాదులకు సూతుండు పక్కాణించె. 128

కం. దేవా ! యావత్తైలం
తావద్వ్యాఖ్యగద ! దేహదార్ఢ్యముతగ్గెన్
సేవించుచుంటి ని న్నును
నావార్ధక్యమ్ము నీవు నడపుము పేర్మిన్.

ఇది
శ్రీ వినాయకచతుర్థీ వ్రతము
సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః
శుభమస్తు - అవిఘ్నమస్తు

# శ్రీ కేదారేశ్వర వ్రతము.

వ. శ్రీ మద్విజయవాటీపురీనికటస్థపర్వతోపత్యకావాసా ।
కృత్తివాసా । అవధరింపుము. 1

శా. సూతుం గన్గొని శౌనకాదులు మునిస్తోత్రార్హ । కేదార వి
ఖ్యాతిం బేర్వడినట్టి సద్వ్రతము పేమాలింపఁగా నెంతుమా
పూతంబౌ వ్రతమేరుచేసి విభవమ్ముల్ గాంచిరద్దాని మా
చేతమ్ముల్ పరిపూతమౌ గమవిశన్ జెప్పంగదే నాపుడున్. 2

వ. సంతసించుచు సూతుం డిట్లను. 3

కం. కోరితిరి మంచికత కే
దారవ్రత మొక్కప్రక్క దాకొల్పి మహో
దారములు వ్రతము లొకపై
పారోపింప నవి తూఁగ వదియే మొగ్గున్. 4

సీ. బ్రహ్మదేవుఁడు జగత్స్రిష్టయై ప్రఖ్యాతి
వడసెఁ గేదారసువ్రతము కతన
విష్ణుదేవుఁడు సర్వవిశ్వరక్షశక్తి
వడసెఁ గేదారసువ్రతము కతన
వింద్రుండు దుర్దానవేంద్ర బాధాముక్తి
వడసెఁ గేదారసువ్రతము కతన
తక్కు దిక్పాలకుల్ తమతమ పదవులు
వడసిరి కేదారవ్రతముకతన.

తే. గీ. సూర్యచంద్రుల కట్టియవార్యమైన
ధామమల్ల కేదారవ్రతప్రభావ
మొసఁగె సత్యమే నుడువ నత్యుక్తిపగిది
మీరు దలఁతురొ ? యేమొ ? కేదారమహిమ. 5

కం. వ్రతములుఁ దపములు మఱిదై
వతములుఁ దీర్థమ్ములున్ సవమ్ములును మునీ
శతులార ! శ్రోతృజనముల
మతినమ్మకఁబట్టి ఫలమమర్చెడినెందుఁగా. 6

కం. సాక్షాత్పరమేశ్వరుఁడుగ
దా ! క్షోణింగల్గు నీవ్రతమ్ములనెల్లఁగా
వీక్షించి నొడివెఁ ద్రిజగ
ద్రక్షకు రసనయు నసత్యతత్పరమగునే ? 7

మ. తనసంతానము లోకమెల్ల నదిమోదంబున్‌గనన్ దండ్రియె
ట్లనుమోదించునొ, యీశ్వరుండు నటులే ఆమోదముం గాఁచెందు ధా
జనులీ సంసృతి ద్రుంగి ద్వంద్వములవిచ్చల్ బాములన్ జెందఁ వా
నివిదప్పింపఁదలంచి యీశ్వరుఁడువిన్పెన్ సద్వ్రతోపాయముల్. 8

తే. గీ. ఆస్తికులు పరమేశ్వరు నాశయం బె
ఱింగి యిహమునఁ దత్తదరిష్టవార
కములుఁబరమార్థ సంధాయకములునైన
వ్రతజపోపవాసాదులు వదలరెపుడు. 9

తే. గీ. ఐహికంబెంత ? యదిత్రుటినంతరించు
"పైనియున్నయది ముసుళ్ళపందు" వనుచు
నెఱిఁగి యాస్తికులగు వారలీశ్వరేశ్వ
రునియజించి తదనుకంపగని సుఖింత్రు. 10

చ. బ్రదికిన నాల్గునాళ్ళరక భిక్షణమందు విహారమందుఁ గో
విదులు విధించు నేమములునీసము చిత్తముఁ గొన్న. కిచ్చినన్
గుదిరినదెల్ల గైకొనుచు గోడున దగ్గముగాఁగ నిండి యా
పదగడపంగఁబెట్టుట కెవండగుఁ బూఁటపచింపచేస్తుమి. 11

కం "ఒడలెఱుఁగని శివ" మనియెడి
వడుపునఁ జరియించి చెడక వ్రతములు జపములన్
మడిమైలలెఱిఁగి నియతిగ
నడిచినవారలకుఁ బరమునదా సుఖమబ్బున్. 12

ఆ. వె. బడికినేగి యయ్యుపాధ్యాయు శిక్షలో
నడఁగి మడఁగియుండు నర్భకుండు
పెద్దయైన పిదపఁ దద్దయుఁ గైకొను
గౌరవంబుఁ బోలుఁగాః వరంబు. 13

వ. వత్సరంబునకు మున్నూఱుంబు మూఁడువందల యఱువది. వ్రతంబుల సంఖ్యయో ః దీనికిఁ గొన్నిరెట్లధికమే యుండెడి నెవరికేవ్రతంబున నెక్కుడు ప్రీతిగుదురునో వారలదియే చేసికొని పరమార్థము గడించుకోవచ్చును. ఈవ్రతంబులనునవి యైచ్ఛికంబులుగాని సంధ్యావందనాదులంబోలె నకరణంబునందుఁ బ్రత్యవాయజనకంబులు గావని యెఱుంగునదియని వెండియు. 14

శా. కేదారేశ్వరుఁ డీశ్వరుండె యతఁ డుత్కృష్టంబు వ్రాఁతచ్చెనీ
కేదారవ్రత మమ్మవారడుగ ః నాకిప్రఖ్యలాలించిరే
భూదారుండొ హొనర్చి భాగ్యముగనెన్ భూదారుఁ డింకొక్కఁడెం
తో దారిద్ర్యముఁ బొందె శ్రద్ధమ్మెయి నాతోరంబు గాపాడమిన్. 15

వ. ఆ భూదారులలో నొక్కఁడు కామాక్షీప్రధానపీఠంబులలోఁ బ్రధానంబుగాఁ బరిగణింపంబడు కాంచీక్షేత్రంబు రాజధానిగా దక్షిణదేశంబు నెల్ల నేకచ్ఛత్రంబుగాఁ బరిపాలించు కాంతారవిష్ణుండను మహారాజు,

రెండవవాఁ డుత్తరదేశంబునెల్ల నేకచ్ఛత్రంబుగాఁ బరిపాలించు నుజ్జయినీ నగర పరిపాలకుండు విక్రమాదిత్యుండను మహారాజు. వీరల కీవ్రత ముపదేశించినవాఁడు కశ్యపప్రజాపతి. అతనికి శతానందుం డీవ్రతమును లోకమునందలి యనుగ్రహముంజేసి ప్రచరింపఁజేయుమని యానతిచ్చె. నా యీ రేండ్లిరువురును దోడియల్లుండ్రు. కాంచీనేత భార్యపేరు పుణ్యవతి, ఉజ్జయినీనేత భార్య పేరు భాగ్యవతి. వీర లిరువురును బతివ్రతా శిరోమణులు. పార్వతీ పరమేశ్వరులను గేదారవ్రతంబున నర్చించిన పుణ్యశీలలు. 16

చ. నృపతుల రెండులోపమగునే। రతనంబులు హేమభూషల
చ్ఛపలమృగాక్షు లిర్వురకుఁ జాలగనుండుట చెప్పనేల। యం
దపగతగర్వపుణ్యవతి యాపె సహోదరి గర్వయుక్త యొ
క్కపు డలరాణికిన్ హృదయమందిటు తోఁచె వికారమై ఖరిన్. 17

ఉ. బంగరుచాయ నాదుకటిపద్మమునం దెసలారుఁ రత్నముల్
బంగరుగూర్చిచేసిన యభంగురముల్ వలయంబులీకరం
బుంగయిసేసెడిన్ గరము పూలకువాసనయట్లు లెందుకిం
దుంగల నూలుతోరమని తోఁచిత్యజించె వ్రతంపుదోరమున్. 18

వ. 'వినాశకాలే విపరీతబుద్ధి' యను తెలుఁగునం బొడమిన చెడుబుద్ధిజేసి కేదారవ్రతమ్మునకెల్ల జీవంబనఁదగు తోరంబు వల భాగ్యవతి తెంచి నికటమ్మున నున్న యెండు కాఁకరపాదుపయిం బడవైచి యనాదరించె. నైశ్వర్యమత్తతచే నాపె కనిపెట్టలేదుగాని యాతోరపు సంపర్కంబునంజేసి యాపాదు కొలదిదినమ్ములలో. 19

కం. కోలుకొని పచ్చఁబడి పలు
పూలున్గాయలును గలిగి పొలుపు మిగిలి ల
క్ష్మీలీలఁ దానకమై
వాలాయము కన్నుగవకుఁ బండువొనర్చెన్. 20

కం తోరముతోరము చనె నా
భూరమణుని రాణు లెల్ల బొలుపఱె పతి పృ
ధ్వీరమణుఁ డయ్యెఁ గ్రమముగ
దారిద్ర్యపరీతుఁడై సదనమున గ్రుగ్గెన్. 21

తే. గీ. ఏమిచెప్పుదు దురవస్థ యెచటిదచట
నేసిరినశించె హేమంతఋతువునందు
దామరకొలంకుపోలె నాధరణినాథు
రాజ్యమెల్లను విప్పచ్చరమ్ము గుడిచె. 22

కం. కారణమిద మిత్థంబని
భూరమణుఁడు గాని యతని బోలఁతియుఁ గానీ
యారయక యురకసంతత
దారిద్ర్యపరీతులగుచు దశతొలఁగి యిటుల్. 23

వ. కొంతకాలమ్ము చిక్కులపై చిక్కులుగా నెల్లెల్లో గడపునెడ-నంత యాపె వ్యాధిగ్రస్తురాలైన కతంబున—గర్భవతి యనియేని గరుణింపక తేఁడు శుద్ధాంతమ్ము వెడలనడచె. పదంపడి కొంతకాలమ్మునకు నారాజ్ఞి భాగ్యవతి యగుటంజేసి యానామంబునకును నాపె పడు దురవస్థకును సందర్భంబించుకయు లేదని యానిర్వ్యాజబంధుపునకుఁ బరమేశ్వరునకుఁ దోఁచెనో యన్నట్లు లాపెకు మనంబున నొక యుపాయంబుఁ గల్పించె నది యెట్లన్న. 24

ఉ. అక్క సమస్తసంపదల కాకరమై తులఁదూఁగుచుండెనే
నక్కమలాక్షి యిర్వురము నంబకు నొక్కతెకే జనించినా
రిక్కయదెట్టిదో తుదకు రిక్తతకున్ గురియైతి నాకు నీ
యిక్కటువాపుఁ గాంచిపురి యేలికసాని కెఱుంగఁజేయుచో. 25

వ. భావిభాగ్యోదయంబునంజేసి యుజ్జయినీ మహారాజ్ఞి కిట్టియూహ పొడమి తనకొడుకుఁ గుఱ్ఱం బిలిచి. 26

తే. గీ. నాయనా! కాంచిపురియందు నాదు నప్ప
గలదు పుణ్యవతీసమాఖ్య రహిమించు
నాపెకడకేగి నీవు నాయాఖ్యచెప్పి
మంతనమ్మున నొడుపుపు మనయవస్థ. 27

వ. ఇంత మాత్రమ్మ నీవానర్పనేర్తువేని మనకు సర్వంబును భద్రం బగునని తల్లి వచించుటయు నాబాలకుండు తల్లికి మ్రొక్కి యింతి యకదా! యిందేమి కష్టమున్న యదియని యుత్సాహమ్ముచూపిన నాపెయు సంతసించి కొమరు నాశీర్వదించియునిపె. నబ్బాలకుండు పెదతల్లింగననేగి దౌవారికులతో నేను మీరాణిగారి చెల్లెలి కొమ రుండ మాతల్లిపేరు భాగ్యవతీదేవి. యని చెప్పుటయు వారలరిగి యాపెకు నివేదించుటయు నమ్మహారాజ్ఞి తనకడకుం దీసికొని రాన నుజ్ఞయిచ్చి రుశలంబడిగి మిక్కిలిగాఁ బేర్మిచూపినయనంతరంబునఁ బ్రసక్తానుప్రసక్తమ్ముగా నాబాలకుని కతనవారల దారిద్ర్యదశ నెఱింగి యాపుణ్యవతీదేవి కడుంగడు విచారించి. 28

ఉ. బంగరువిచ్చి రత్నములపారముగా నిడి వస్త్రరాశినే
సుంగులమీఁదఁగట్టి యిటు నూఱులువేలును గోట్లుగాఁ గఁదోఁ
లంగను సర్వమున్ గ్రహబలంబదిలేమి నెటోసురుంగున
య్యంగజవైరి పేర్మిగనకబ్బునె! సంపద లబ్బనిల్బునే! 29

వ. ఇట్టులు పెద్దతల్లి తన చెల్లెలియందలి పేరిమింజేసి రెండు మూఁడు సారులు సిరినొసంగి పంపుటయు మధ్యేమార్గమ్మున నది యెట్లో యంతర్ధానంబగు కతన నక్కజంబుగాఁదోఁచి యప్పుణ్యశీల భగ వద్భక్తిపరాయణ గావునఁ గొండొక యోజించి యాబాలకుతో నిట్లనియె. 30

చ. శివుని భజింతురే! శివుయజించెదరే! శివలీలలెంతురే
శివునభిషేకముల్ తఱచుసేయుదురే? శివరాత్రులుందురే!

కవిత శివుం గురించినది గట్టినవారల సత్కరింతురే ।
శివుని పురాణములిన్ని ఘటింతురె । శ్రీగణపుప్రసాదమున. 31

సీ. భవునాలయంబున భజనలు జరుగుచో
నరిగి వీక్షింతురే । అప్పుడప్పుడు
శివుదేవళంబున సేవలు జరుగుచో
నటకేగి చూతురే । అప్పుడప్పుడు
అభవునిఁ గోటిబిల్వార్చనంబులకేగి
యరసి పాల్గొందురే । అప్పుడప్పుడు
శంకరు కళ్యాణసంభ్రమంబులకు ద్ర
వ్యంబులర్పింతురే । అప్పుడప్పుడు.

తే. గీ. కలఁడు మీప్రోలిలో మహాకాళనాథుఁ
డదిశిరోమణి భువిలోని యన్నితీర్థ
ములకు । మీతండ్రి వేఁడిడుకొలకుఁ గార
ణంబు శివపూజలేమి యన్యంబులేదు. 32

వ. మీయమ్మయు నేనును నొక పేదవైశ్యగృహస్థుని కొమార్తలమై చిన్ననాఁడు శ్రీకేదారేశ్వరు నారాధించు వ్రతం బొనర్చు కుతూహలముతో మాతండ్రి ననుజ్ఞ యిమ్మని వేడుటయు నయ్యనఘుండు. 33

కం. ఏదినమున కాదిన మెటు
లో దినవెచ్చమ్ము గడపుచుండెడి నేనా
కేదారేశు వ్రతంబున
కేది యొసఁగువాఁడఁ దెచ్చి కృపణుఁడఁ దల్లీ । 34

వ. అని దీనదీనంబుగాఁ బలికి, అమ్మా ! మనయెడల నాయవ్యాజకరుణాశాలికి ననుగ్రహము కలిగి యేకొంచెమేని సిరి గలిగించుచో నప్పుడు తప్పక యమ్మహాదేవు నర్పించికొందురుగాక యనవుడు మాతండ్రితో మేమిట్లంటిమి. 35

మ. జనకా! శక్తికొలందిగా నభవుఁబూజన్ జేసి మెప్పించుచో
ధనధాన్యంబులు గల్గఁగాని దినమున్ దారిద్ర్యమున్ గుద్చుచో
ధనధాన్యంబులొసంగునే! శివుఁడు, విత్తంబబ్బుపై హెచ్చుగాఁ
బొనరింపంగలమంచుఁ గాలమువృథాపుచ్చన్ సిరుల్గల్గునే! 36

తే. గీ. పిచ్చికుదిరినమీఁదటఁ బెండ్లి, పెండ్లి
యైనమీఁదటఁ బిచ్చితానంతరించు
నన్నపెద్దలసుడిగల దట్టులగుట
వలవదన్యోన్యమును ముడిపైచుతెలుఁగు. 37

వ. పార్వతీపరమేశ్వరుల ప్రసంగమ్మున నీకేదారవ్రత మాహాత్మ్యంబు నందికేశ్వరుండు విని యయ్యది పరమశివభక్తుండగు చిత్రాంగదుం డను గంధర్వరాజున కుపదేశింప నాగంధర్వాధిపతి—"ఏకస్స్వా దునభుంజీత" యనియెంచి భూలోకమ్మునందుఁ బెక్కురు దారిద్ర్య పీడచే నొగులు వారలు గలరుగదా! వారలిక్కృతన ననామ యాయు రైశ్వర్యోపేతులగుదురు గాకయని యెంచి భూలోకమ్మున కరుదెంచి మనదేశంబేలుతేని కొమరున కుపదేశించి చనియెనఁట! అతండు శ్రద్ధాభక్తులతో విద్దాని నాచరింపఁబూను కతంబునఁ దండ్రి సామా న్యపు జేఁడయ్యు నీయనఘుండు చక్రవర్తియయ్యెనని తజ్ఞులుచెప్పఁ గా వింటిమియని వెండియు. 38

ఆ. వె. ఈవనుజ్ఞ యిచ్చితేని కేదారేశ
వ్రతము నెట్లొ సలుపువార మేము
వలయు పరికరములు వామదేవుండె తా
సేకరించి యిచ్చుఁ జింతవలదు. 39

వ. ఇట్లు మాతండ్రిని మీయమ్మయు నేనును సారెసారె హెచ్చరింప భావిభాగ్యోదయవశంబున రిక్తుండయ్యును మాజనకుండు భక్తితత్ప రుఁ డగుటంజేసి యందుల కనుమతి యొసంగి సామగ్రీసంపాద

నంబునకై యత్నింప నా దీనబంధుండు పరమేశ్వరుం డాయన యొనర్చు వ్రతకంబునఁ బూర్వపుణ్యంబునం గొండొక యభిలాషం బగు పట్టునట్లు కరుణించె, మేమిరువురము శ్రీకేదారేశ్వరుని వ్రతమారంభించి యొకటి రెండేండ్లు సేయునంతలో. 40

తే. గీ. ఈశ్వరుండు ప్రత్యక్షమై యొసకి మెసఁగ
నచ్చరలకన్న మిన్నగా నందచంద
ములు కటాక్షించి యంతర్థిమొనసి చనియె
నక్కూతనఁ గాదె ! ఛేండ్ల కిల్లాంధ్రమగుట. 41

వ. అని వెండియు. 42

తే. గీ. నీవు రాకొమరుండవు నీకు నేమి
తెలియు నీగాథ వైశ్యపుత్రికల మేము
అడిగితివయేని చెప్ప మీయమ్మ మరచి
యుండ దనవుడు నబ్బాలకుండు వలికె. 43

వ. అమ్మా ! నాకీగాథ లెయ్యవియుం దెలియవు. నేను మాయమ్మ గర్భంబునంబడ్డ కొలఁదినాళ్ళకే మాతండ్రి యాపెపై విరక్తి వొడమి యంతిపురి వెడలించి యవమానించుకతమున నాయవమానంబు సహింపరామి నేమృగంబుల వాతనేనిం బడి యసువులు దొరంగు తలంపుతో నడవుల నడయాడుచుండఁ గొండరాజగు నొక బోయ కులీనుం డాయమ నాదరించి పుత్రికంటోలెఁ బ్రేమించి మనిచె, నే నచటన వొడమితి, నన్నుఁ జూచి యాబోయ లప్పుడప్పుడు. 44

ఉ. ఈతఁడు చక్రవర్తిసుతుఁ డెంత యదృష్టవిహీనుఁడో ! కిటా
జాతుఁడు గాకపూర్వమె రసాపతితల్లిని వెళ్ళగొట్టెన
ర్వాతిశయంబుగా బ్రదుకునట్టి సిరుల్ గల తేవిపుత్రుఁడై
యీతఁడు నివ్వనీస్థలికి నీగతిఁజేరి వసించుదీనుఁడై. 45

వ. ఇట్లు నన్నుం జూచి గుసగుసలు వోవుచుందురు. నేనయ్యవి వివి మాయమ్మ నడిగినను నామె కన్నీరు నించి యిది యంతయుం బురాకృతంబని విచారించుఁగాని యంతకు మించి వచింపదు నేఁడు నీవు నొడువుకతన సకలంబు నెఱింగితి ననవుడు నాపె కడుంగడు వగచి యాపట్టిని బుజ్జగించి తండ్రీ! మీకు మంచిదినమ్ములు రానై యున్నవి. అందులకు మీయమ్మ నిన్నిప్పటికి నంపుటయే సూచకంబు. ఆపదలెప్పటికి నిల్వట్టి కాపురం బొనర్పవని వెండియు. 46

కం. తనకరమునఁ గల తోరముఁ
గనఁజేసి కుమార! అమ్మకరమున నిద్దా
నినిబోలుతోరముసుగనుఁ
గొనియుంటివె! చెప్పుమనుడుఁ గొడుకిట్లనియెన్. 47

ఆ. వె. ఆపెహస్తమందు నరయఁగాలేదు నీ
వేల? దీనిఁదాల్చి తెలుఁగఁజెపుమ!
అనుడు నాపెకఖిలమవగతంబయి కట
కటఁబడుచు మిగుల వగలను బొగిలి. 48

వ. తండ్రీ! యీతోరంబు సకలైశ్వర్యంబునకును గారకంబగు శ్రీకేదారేశ్వరవ్రతంబునకెల్ల జీవాతువగు చిహ్నంబు. మీయమ్మ చక్రవర్తికి భార్యయై యైశ్వర్యమత్తతచే నీతోరంబు త్యజించి యిట్టి దురవస్థకొనితెచ్చికొన్నట్టు లిప్పటికినాకు నవగతంబయ్యెఁ గొలఁది నాళ్ళలో నీయిడుమలు తొలఁగునుపాయంబుగలదు. అందనుకనిచ్చటనయుండుమని యాఁపినంతట శరదృతువు సంపన్నంబగుటయు నాపట్టమహిషి యథాపూర్వంబుగఁ గేదారవ్రతము నాచరించి యారాకొమరుచేఁ గూడ నాచరింపంజేసి కేదారేశునెదుట నిలువంబడి తనచెల్లెలి యపరాధంబు క్షమింపుమని యిట్లు ప్రార్థించె. 49

ఉ. దైవతమౌళి ! మానవులు తప్పిదముల్ గణియింప రెన్నఁ డే
సేవకతానఁగల్గు సిరిచెట్టుముతెన్ని మాటు టుగు, లంకలో
నావెఱసోదరీమణి పొసఁగ్చిన దైవిదమునకంటు. దాప సే
భావముసైఁపకున్న నృపుధార్యయెటుల్ సహియించె రాముఁడే. 50

తే. గీ. చీదకోమటిబిడ్డలఁ వేదరాంధ్ర
నెక్కఁజేసితిమేరువు నొక్కట్రుటిని
గతమెఱిఁగి చరియింపదుగార యామె
అంతమాత్రనఁ గోపింతురయ్య దేవ ! 51

చ. ఎఱిఁగిన పూరుషోత్తములనే సిరి వంచనఁజేయునెంచ బ్ర
గరువపుఁ జైదముల్ సలుపగాఁ బురికొల్పుట నీవెఱుఁగు వే
శ్వర ! యబలాజనంబునకు జ్ఞానము గల్గునె ! తగ్గఁగాదె సు
స్థిరముగనిల్చునే ! యడియు, దేవర ! తప్పిదముల్ గణింతువే. 52

తే. గీ. ఆపెమగనికి సార్వభౌమాధిపత్య
మిచ్చినట్టిఁడవీవె యయ్యింతినతవి
యాలిఁజేసినయట్టి దయాళుఁడీవె
యిదుమఁగుడిపించు వాఁడవునీవెదేవ. 53

కం. నీకిది విలాసమగుఁగా
కాకలికి భరింపఁగలదె ! యనదయగుచు లో
కైకవిభుభార్య గుందుట
నీకరుణకుఁ దప్పుగాదె ! నిగమవతంసా ! 54

కం. ఇచ్చెదవు సిరులనందే
మెచ్చెమ్మనులేదు వానిభోగించువిధం
బెచ్చటనో తక్కినచో
సచ్చరితులె యెఱుఁగరవినఁ జానలవశమే ! 55

కం. మురిపించిటిగడ! సిరి దీ
వి యిద్దరియెడ మించి ప్రేమగల దా
రిపడని సిరిసిరము సతి
పదేశ సమ్మతితనాదుమాంత్రాగనుచే! 56

వ. అని పెక్కు విధమ్ముల బ్రార్థించి క్షమాపణంబు చెప్పి యద్వాయ
సుం గౌరితోరంబుగట్టి పేరోలు తోరంబు తన చెలియలికి నొక్క
బంగారు టి మంటు భద్రపఱిచి యిచ్చి, ధనధాన్యవస్త్రభూషణాద్య
సమస్తవస్తువులను సవ్వారిగా నొసంగి తగుపరివారంబు తోడొసంగి
యద్వాలయం బంపిన నాపిల్లండు పరమానంద భరితుండై కతిపయ
ప్రయాణంబుల సుజ్జయినీ పురంబు చేరుట కింబుక పూర్వమే పర
మేశ్వరుండు తేనికిఁ గలలోఁ బొడకట్టి యిట్లుపోద్ధించె. 57

శా. పాతివ్రత్యవిధానమైన పడఁతిన్ బ్యావ్యంకితత్వం బొగిన్
హేతుస్ఫూర్తిగఁ జూపి పోవిడుతురే! యీవ్యాధి నీకబ్బుటో
నీతోఁ బొందికఁ నాడుగూడదని యానీరేజపత్రాక్షి యీ
వేళ న్నిన్నుఁ బరిత్యజింపఁ గలదే! నీకిద్ది ధర్మంబెటుల్. 58

వ. అని వెండియు. 59

తే. గీ. ఆపె కేవ్యాధియును లేదు చూవ! సిరియె
వ్యాధిగల్పించె నది బాములందఁ జేసెఁ
గష్టకాలంబు తొలఁగె సౌఖ్యపడుకాల
మేగుదెంచిన దాతన్వి నేలికొనుము. 60

కం. సిరివంటి చుట్టమునులే
దెఱుఁగుము సిరివంటి శత్రువెందును లేదో
నరవర! తెల్పఁగ నిప్ప
చ్చరమును గల్పించినాఁడ సరసిజముఖికిన్. 61

తే. గీ బీదకోమటికిం బుట్టి పెరిఁగి నన్ను
వ్రతముచేఁ దృప్తి నొనరించి పైభవమున
కెక్కుడైయె వ్రతపుం దోరమెల్లి దపుగఁ
బాఱవైచిన కతమున బాములబ్బె. 62

కం. వ్రత మఖిలమ్మొకయెత్తి
వ్రతపుం దోరమొకయెత్తు వ్రతమొనరుచు ధీ
యుతు లిది తెలిసికొనుటకో
క్షితిపా ? నాసలిపినట్టి చెయిద మెఱుఁగుమా ॥ 63

కం. ఒడలెల్లను బంగారపుఁ
దొడవులు రతనపులుఁదాపు తొడవులునై యా
నడుమునొక తోరముండినఁ
జెడెనే ! యందమ్మునీదు చేడియకధిపా. 64

తే. గీ. దేవతాప్రసాదంబు జందెంపుఁబోచ
లట్టులె విభూతిరుదురాక లెట్టిసిరిని
దూఁగువారును గర్వంబు రేఁగివిడువ
రాదనివచించు భూపః తోరంపుఁజరిత. 65

కం. ఈ నియమంబెఱుఁగని జడు
లేనియతిన్ వ్రతముఁ జేసిరేనియు వృధయౌ
నానయుడినాఁడ నీ వి
ద్దానిం బ్రచురింపురాజధాని మఱెందుఁ. 66

వ. ఇట్లుపదేశించి పరమేశ్వరుండు కనుమొఱంగినట్లు స్వప్నంబుగాంచి తేఁడు మేలుకొని మేలుకంటినని సంతసింపుచు భిల్లుస్త్రీలికి నంద అంబునంపించి యంతఃపురమర్యాదలతో మహిషిని రప్పించుకొను నప్పటికిఁ గోమరుండుచని గతంబఖిలమ్ము నొడివి తల్లికిఁ దోరం బొసంగ నాపె తనదోషంబునెఱింగి పరమేశ్వరునకు క్షమాపణంబు

[illegible] ధరించి సుఖంబుండి ప్రతివత్సర
[illegible] బోధించి యాచరింపించు
[illegible]. దీని మహిమం [illegible]
[illegible]. 67

తే. గీ. [illegible]
[illegible]
[illegible] సర్వ
[illegible] ॥ 68

కం. [illegible]
వాకొనినామ్నాయములు వ్రతముపచరించువిధం
బేకమె వ్రతియుడుఫల
పాకంబును నేకమెయుఁగవలయు మునీంద్రుల్. 69

కం. శ్రుతులు విభిన్నము లరయుఁడు
స్మృతులును భిన్నములె యాచరించునెడ ఫల
శ్రుతిలో భేదంబుండదు
కతలెల్లను నర్థవాద కల్పితము లగున్. 70

తే. గీ. అర్థవాదములనినంత యసలు కృతికి
నించుకయు లోపమున్నఁటో దెలుఁగుఁ డయ్య!
యెట్లు భగవంతుఁ బూజించిరేని సుకృత
మబ్బునను నిశ్చయమ్ము తప్పబ్బుగాదు. 71

వ. ఈ కతలోఁ బుణ్యవతీభాగ్యవతుల నామధేయంబులం గుఱించియు వారలేలు ప్రదేశంబులం గూర్చియుఁ గాక భాగ్యవతి నంతిపురినుండి వెడలనడఁచిన పదపడి యాపె నాదరించిన యాయనన్ గూర్చియు నొకచో నొకవిధంబుగను వేఱొకచో వేఱొక విధంబుగను నున్నను

ప్రధానంబగు వ్రతమ్మునఁ గాని తత్ఫలితంబునఁ గాని యపవా-
దంబు బాధకంబుగాదని విజ్ఞులగు మీరు వక్కాణింపవలసి యున్న
దని వెండియు. 72

కం. కేదారేశ వ్రతంబున
కేదైవతపు వ్రతమేని యీడసరాదో
భూదేవులార! యీకత
యేదిగులున్ బాపి యొసఁగునెల్ల శుభములన్. 73

కం. కేదారేశుని నోమిన
భూదారంబేని తుదకు భూదారుఁడగున్
కేదారేశుని నోమని
శ్రీదారుండేని తుదకు శ్రీహీనుఁడగున్. 74

కం. కేదారేశు భజించెదఁ
గేదారేశ్వరు యజింతుఁ గేదారేట్ఛ్రీ
పాదముల నాశ్రయించెదఁ
గేదారేశునకు మోడ్పుఁ గేలర్పింతున్. 75

వ. అని శౌనకాదులకు సూతుండు వక్కాణించె.

కం. దేవా! యావత్తైలం
తావద్వ్యాఖ్యగద! దేహదార్ఢ్యముతగ్గెన్
సేవించుచుంటి నిన్నును
నావార్ధక్యమ్ము నీవు నడపుము పేర్మిన్.

ఇది
శ్రీ కేదారేశ్వర వ్రతము
సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# శ్రీ కార్తికసోమవార వ్రతము.

కం. శ్రీనగజా ప్రాణపతీ।
మౌనిగణస్తోత్ర వంద్యమానవిభవ। భ
క్తానీకార్చిత పద ప
ద్మా। నిర్మలభావ। మల్లికార్జునదేవా। 1

ప. అక్కథకుండు రోమహర్షణి శివప్రసాదమహత్త్వంబు
శౌనకాదుల కిట్లు వక్కాణింపం దొడంగె. 2

చ. కలఁ డొకబ్రాహ్మణోత్తముఁ డఖండతపస్వి పరాత్మవేది ని
స్తులగుణరత్న భూషణుఁడు సూరిజనస్తవనీయుఁ డాతఁడే
యులకు శిరోపతించ మతియోగ్యుఁడు తత్సతిగూడ నన్నిటన్
దుల నిడఁ దూఁగు నాతనికిఁ దొయ్యలు లాపెకు సాటి రా రొరుల్.

కం. ఆచారపరులు సుకృత
ప్రాచుర్యము వొల్చువారు పరమోత్తములౌ
నాచారుశీలురకు లో
టే చక్కంగాన రా దహీనులు వారల్. 4

తే. గీ. రాజపూజ్యత గలదు మర్యాద గలదు
పాఁడి పంటయుఁ గల దూరివారలెల్ల
వారిసంపత్తిఁ జూచి యవారి సుఖము
నందుచుందురు వారిపెంపట్టి దగుట. 5

తే. గీ. ఎఱుఁగఁడు దురన్న దుర్దాన హీనకృతుల
నెఱుఁగఁ దప మెట్టిదియు శిష్యు లెపుడుఁ గొలుప

వేదశాస్త్రసద్గోష్ఠి నా విప్రసతి
యుండు కాలమ్ము గడపుచు నుండియుండె. 6

కం. సంతానము లేదనెడి కొ
అంత యొకటిదక్క నా ధరాసురసతి నే
చింతయు లే దక్కఱటన ని
రంతర మయ్యనఘవార్త వ్రతము లొనర్చున్. 7

సీ. నాగప్రతిష్ఠను నాగస్తోత్రప్రకా
రమునఁ గావింప వ్యర్థంబె యయ్యె
నశ్వత్థవృక్షాన శాస్త్రోక్తవిధిని ప్ర
దక్షిణమ్ములను వ్యర్థములె యయ్యె
నాంజనేయస్వామి నారాధ్యుఁగా నెంచి
వ్రతమొనర్చినను వ్యర్థమ్మె యయ్యె
సంతానగోపాలు సాఁగిలి మ్రొక్కి సం
తానమ్ము గోరి వ్యర్థమ్మె యయ్యెఁ

తే. గీ. గాని విను వన్నమాటయే గాన రాద
అమహోమహా నిల్లాలి కనుదినమ్ము
నేదియో యొండు సంతతి కాదరమున
వ్రతమనెడిపేరఁ జేయు నప్పరమసాధ్వి. 8

వ. ఇట్లు వ్రతోపవాసాదులతోఁ గొండొక కాలమ్ము గడచె నంతట నాపుణ్యదంపతులకు వార్ధకవయస్సు దాదాపుగఁ గనవచ్చె నట్టితఱి నొక్కెడఁ బార్వతి పరమేశ్వరునితో నిట్లు వక్కాణించె. 9

కం. ఎఱుఁగుదురో ! యెఱుఁగరో ! యు
ర్వరలో నొకవిప్రసాధ్వి పలువ్రతములు దే
వరల నొకరి ననసేటికిఁ
దరువుల నయితమ్ము నోముఁ దనయునికొఱకై. 10

తే. గీ. ఆపె పడుచున్న కష్టిమీ కవగతంబు
కాదుగాక మాసమున కొక్కదినమేని
రెండుపూటలు దినదు పరుండు స్థండి
లమున జాలిగ నుండు నయ్యమతెఱంగు. 11

కం. మనల గుఱియించి యాద్విజ
వనితామణి చేయకున్న వ్రతములు పెక్కుల్
పొనరిచె నేపేవియొ! స
ర్వవిలింపాత్మకులు మీరు వంచన తగునే! 12

ఉ. కొందఱు సూర్యునింగుఱిచి కొందఱు చంద్రుగుఱించియున్ శశా
నందుగుఱించి కొందఱును నన్ను మదంశము గీర్వధూటి నా
యిందిర నాపెభర్త నిటు లేరికి నెందు లగించుఁ జిత్తమం
దందున నిల్పి నోతురు సమస్తము దేవరకే ఘటించెడిఁగా. 13

తే. గీ. ఆకసమునుండి పడెడిఁ దోయమ్ము చాల
వఱకు సంద్రమ్ములోఁ గొంత వారిమాత్ర
మక్కడక్కడఁ గురియు సమస్తమవల
నబ్ధికే చేరు దేవర కఖిల మెఱుక. 14

కం. ఫలదాతలు మీరలు మి
మ్ములనే సేవింత్రు తత్త్వము నెఱింగిన యో
గు, లితరు లితరులఁ గొలుతురు
ఫల మిడ కెటు తప్పు మీకుఁ బరికించినచో. 15

వ. ఇట్లు లంబిక యాబ్రాహ్మణోత్తము నిల్లాలిం గుఱిచి పరమేశ్వరు
నితోఁ బ్రసంగించుటయు నమ్మహాదేవుండు. 16

చ. కలికిరో! నీవు చెప్పెడిప్రకారము సర్వము న్యాయ్య మెవ్వరి
మ్ముల నెవరింగుఱించి తపముం బొనరించిన నాక చెందు నీ

వలసిన భార మున్నయది వారలకోరిన నాఁటి, నిక్క...
పలికితి నీవు, బ్రాహ్మణునిగావ్య మహోత్తమునిఁ [illegible]. 17

తే. గీ. సంతుఁ గోరి తపించెడి సంతుగాని
యేదిగాని పురాకృతం బెఱిఁగి యాయు
వలయు నీవేని నేనేని వరిగి । ప్రసూతి
మట్టు లొసఁగిన వారల రబ్బు పసిపు. 18

కం. తెలివియుఁ దేటయు మిక్కిలి
గలవాఁడే యయ్యు వాఁడు గలికాలవశముగా
వలచి చెడి పేరు చెఱచుగా,
ఖలుఁడగుఁ బ్రాకృతులనిక్కగతి యటులుండెన్. 19

ఆ. వె. దాసిఁ దప్పఁ ద్రోయఁగా నేను నేరను
గర్మగతికి ముక్తిఁ గాక యున్న
దా విముక్తి లేదు తరళాక్షి । యోజింప
తులఁ దలంప నాకుఁ గలుగు జాలి. 20

వ. అందులకై యోజించుచుంటి నట్టులే కావున్న నింక మున్నున్న యమ్మహాసాధ్వికోర్కె నెఱవేర్చి యుండు నవసరమునఁ బరమేశ్వరి పరమేశ్వరున కిట్లను. 21

చ. ఎఱుఁగనివాండ్రతో నాడువుఁ డిట్టివి దేవ! సత్త్వ: కర్మ మె
వ్వరికిని భోజ్య మన్ననుడి వాస్తవమే యగుఁగాక మీరు నీ
శ్వరబిరుదంబు వర్తిలెడి సర్వసమర్థులు మీరు మున్మున
డ్డరు హరిముఖ్యు లెయ్యది గడంగి యెటుల్ తలఁకిం దొనర్చినన్. 22

కం. కర్తు మకర్తు మితరథా
కర్తుం శక్తులరు మీరు గరిమమ్మున ము
మ్మూర్తు లెఱుంగరు కొండొక
నేర్తున్ మీగరిమ మెఱిఁగి నేర్పున మెలఁగన్. 23

ఉ. మీ రెఱి యెట్లొనర్చినను మిన్నక చూచుటె తప్పు వేల్పులం
దేలను "గ" మ్మటించనని యేఁ గనిపెట్టితి మౌనినాతిరిన్
గూరిమిఁ గల్పకల్పములఁ జెడక దేటి యాయు విప్ర మీ
పేరిమి నెవ్వ రాఁగి రతివేలము మీర్చుచు కద్ద మున్నదే? 24

వ. మీ నిరుపాధిక కారుణ్యముం గొనియాడ నే నెంతదాన నది యటు లుండె నిప్పుడీ విప్రసాధ్వీమణికి నొసంగు కొమరుండు దుష్ప్రవర్తనుం డగుటకుంగల కతంబు వినఁగోరెద నావుడుఁ బరమేశ్వరుండు.

చ. వినుము తలోదరీ! మఖము విప్రుఁ డొనర్చెను బుత్రకోస మం
దున నొక ఋత్విజుండు స్వరదోషము రా మను పుచ్చరించె దా
నిని యజమానుఁ డారసి యసంద్యుని నాతని జూచె నంత నా
యనఘుఁడు క్రుద్ధుఁడై ద్విజవరాగ్రణి నిట్లు శపించెఁ గ్రన్ననన్. 26

వ. అయ్యా! నాకు మంత్రోచ్చారణమ్మునెడఁ గల్గిన స్వరదోషంబునకుఁ గతం బనివార్యంబగు నా పుణ్యంతగాని నా ప్రమాదంబు గాదు నీవు తత్త్వమ్మును గమనింపక నన్ను మూర్ఖయని దూఱితివి కావున. 27

శా. నీకుం బుట్టు తనూభవుం డగు జగన్నింద్యుండు మూర్ఖుండు దు
ర్భిసుండున్ విటుఁ డంగనాజితుఁడు నీ తేజంబు కుంచించు వాఁ
డకాలుష్యము లేని నన్నుం గని నీ వేమేమొ దూషించి తా
పాకం బూరకపోదు కట్టిఁడుఁపున్ బల్మాట లింకేటికిన్. 28

వ. నావుడు నమ్మఖకర్త పశ్చాత్తాపంబు నొంది నాయొనర్చిన తొందరపాటు క్షమింపుమని యమ్మునికాళ్ళపయిం బడి యనునయించుచు.

ఆ. వె. ఎవఁడుగాని మూర్ఖుఁడేని పూజ్యత లేదు
విప్రుఁడైన వేఱ చెదకపలెనె!
పశువురీతి శూద్రుఁబాతి మూర్ఖుండైన
బ్రాహ్మణుండు కర్మబాహ్యుఁ డరయ. 30

కం. ఏరా జేలెడి భువిఁ బెం
పారఁగ మూర్ఖుండు పూజ్యుఁడై విప్రుఁడు భూ
దారుం డాతఁడు నింద్యుం
డారాజ్యము విడుచు టొప్పు ననఘులు విజ్ఞుల్. 31

కం. తనదేశమ్మునఁ గల మూ
ర్ఖుని విప్రుని రాజు దున్నుకొనువానిఁగఁ జే
యనగున్ బన్నిదుశూద్రునిఁ
గనుగతి నవ్వానిఁ జూడఁగాఁ దగు నెందుఁగా. 32

కం. భూసురశూన్యంబుగఁ దాఁ
జేసినసుం గర్మ మొకటఁ జేయఁగవచ్చున్
బో! సేయరాదు మూర్ఖుని
బోసేయఁగఁ బెట్టి యెట్టి మునప్పననేనిన్. 33

కం. జడుఁడైన విప్రునకు నె
వ్వఁడు నేమియు నీయరా దవశ్యమయే నె
క్కుడుగ నిడక వొట్టకు సరి
పడునన్నము పెట్టి పంపవలయుం బ్రాజ్ఞుల్. 34

ఉ. భూపతిచేత మన్ననలు వొందఁగ నర్హుఁడు గాఁడు దైవతా
శాపరిపూర్తికిం దగిననత్కృతికిం గొలఁగాఁడు పైతృకో
ద్యాపన మాచరించుటకుఁ దజ్ఞులు పిల్వఁగ నమ్మతింప రిం
కేపని సేయఁగావలయు నిట్టిసుతుం గని బుత్త్విగుత్తమా? 35

తే. గీ. అయ్య! బుత్త్విజ! సంసారమందు మూర్ఖ
పుత్రతకు మించుకష్టమ్ము పుడమిఁ గలదె?
అంతకన్నను జావు మే లన్య మేది
యేనియు భరింపనగుఁ గృపఁ బూను మనఘ! 36

వ. అని యెడతెగని సంతాపంబున వేదు నయ్యలఘునియెడఁ గరుణించి
యాబుత్త్విక్సత్తముం డిట్లను. 37

తల్లి కపటరీతిఁ దనయుఁ గాపాడుటఁ
జేసి వాఁడు మిగులఁ జెట్ట యయ్యె. 43

ఆ. వె. విప్రబాలకుండు వెదురుబొంగును పంప
కున్న యెడల రాచపున్నవలకుఁ
గాక దొమ్మరాటకత్తియ * పద్ధతి
కగ్గమగు నటందు రార్యు లెందు. 44

కం. కావున బాల్యమునందున
ధీవరులు తనూజు నెఱిఁగి ధీ గలుపినచో
దేవప్రియుఁడగు నొందెడ
దేవానాంప్రియత గూరి దృష్టంత యగుడా. 45

కం. గారమ్ము కుఱ్ఱలకు నప
కారమ్మొనరించు శిక్ష గరపినచో నం
స్కారమ్ము గల్గియది యుప
కార మ్మొనరించు నెఱుఁగఁగాఁ దగు గేస్తుల్. 46

వ. ఆబ్రాహ్మణుండు సర్వమ్ము నెఱింగినవాఁ డగుటంజేసి సర్వవిధమ్ములఁ గొమరు విద్యావంతు నొనర్ప యత్నించెంగాని తల్లి వాని పట్టుగా నుండి సంజ వార్చకున్నను వార్చెననియుఁ బారమ్ము చదువకున్నను జదివెననియు భర్తకుంజెప్పి వానికి శిక్ష లేకుండఁ జేయుఁచు గాలమ్ము గడపందొడంగె, నిట్లు యుక్తకాలం బతిక్రమించె. 47

మ. పదియాఱేఁడుల ప్రాయ మంతటను సంప్రాప్తించె వేశ్యా జనా
స్పదముల్ దూరుట వాంఛకవ్వియలతో సంబంధబాంధవ్యముల్
మదిరాస్వాదన మాదిగా సకలదుర్మార్గమ్ము లాయీడు కో
విదవిందుర్యం బొనరించి నేర్పఁదొడఁగెన్ విప్రుల్ గడున్ రోయఁగన్.

* టిప్పణి : పద్ధతి = రీతి, (పద్-హతి) కాలిబాట.

ఆ. వె అంకినంతవట్టు నమ్మకుఁ నయ్యకుఁ
దెలియకుండ నింట దేనినేని
గొనుచుఁ బోయి వేశ్య కూఁతుల కిడుచుండెఁ
దల్లి యెఱిఁగికూడ దాఁచుచుండె. 49

తే. గీ. ఏకపుత్రవిషయమిటు లెల్లగతుల
గారమునకుఁ గారణమయి కడకు విప్ర
బాలు నన్నివిధమ్ములఁ బాడుచేసి
యిహముఁ బరమును లేకుండునెగ్గు గూర్చె. 50

తే. గీ. అగునుగా కొక్కఁడే కొడు కకట! "గడ్డ
పారతో మక్కు గుట్టించువారు" గలరె!
అనుచు బందుగు లితరులు నాడఁదొడఁగి
రిట్లు గతియించెఁ గాల మొక్కింత పిదప. 51

కం. జనరునకు రాజుగా రి
చ్చిన పచ్చల యుంగరమ్ము చేఁజిక్కుడు దా
నిని దెచ్చి వేశ్యకన్యక
కు నొసంగెనెఱుంగఁ డతఁడు కొడుకుచెయిదమున్. 52

శా. "పుత్రం మిత్రవ దాచరే" త్తనువయస్ప్రా ప్తిన్ గుమారుం డిటుల్
శత్రుండై చరియింపఁ దండ్రి మిగులన్ సంతాపముగా జెంది యే
మాత్రమ్మో కలిగించుకో జనని సంబాళించు నిట్లొటఁ జా
రిత్రం బెంతయుఁ బాడువాటి కడు దుర్వృత్తుండు వాఁడై చెడెన్. 53

వ. అంత నొక్కనాఁడు తండ్రిస్నానార్థం బరిగి వచ్చుచుండఁ గొందఱు
కొడుకు నీడువాం డ్రొక్కెడ గుంపుగాఁ గూరుచుండి యేకసక్క
ముగాఁ దమలోఁ దా మొనర్చుకొను ప్రసంగమ్ములో నీపచ్చల
యుంగరపుఁ బ్రసక్తిం దెచ్చి యయ్యది యీబ్రాహ్మణుని హస్తమ్మున

యున్నదని వాడిన రుజను
య్యనమరలున్ వేఱులేదుపాయమువత్సా. 72

వ. నాపుడు గణనాధుండిట్లను. 73

చ. ఇపుడలసాధ్వి నాకు నెదియే నవమానము సేయుఁగాక ము
న్నపరిమితమ్ముగా నిడియె నాయమయుంద్రములర్చలిచ్చి యా
యుపకృతియెట్లుగా మఱచునఃల్లము, తిన్నది తేన్పురాదె । యీ
కృపణత నాకుఁబెట్టవలదెవ్వరి నేనియుఁ బంపవేడెదన్. 74

కం. కృతముమఱచి నేవృథగాఁ
గృతఘ్నతకుఁ బాలుపడినయెడ మీరే నఙా
బతితుఁడనుచు దూషించెద
రితి కర్తవ్యమ్మునకుఁ బంపుఁడేరినో । మీరిల్. 75

వ. నాపుడు శంకరుండు కౌమరుని కృతజ్ఞతకు డెందంబున నానం
దించుచు నాచారుశీలకు నైశ్వర్యంబొసంగినది నందికేశ్వరుఁడె
కావున నతని మీఁదనె యీకార్యభారంబుంచుట యుక్తియుక్తంబుగ
నుండునని యెంచి యతనిరావించి పార్వతివిన విట్లనియె. 76

ఉ. ఇచ్చితివీవు బ్రాహ్మణికి హెచ్చుగ సంపద లాపెముందు ని
ప్పచ్చరమందుఁ జాలగుణవర్తకు విక్కగసంచరించె ని
వ్వచ్చరమీవు పాపి కడు భాగ్యమొసంగితి మంచిదే సిరుల్
హెచ్చిక్రమమ్ముగా సుదతియెల్లర నేలిదమొప్పుఁజూచెడిన్. 77

వ. తపో్పి యొపో్పి నీయొనర్చినది నీవే సవరించికొనవలయుంగాన
నది యెట్లు సవరించి కొందువో । సవరించికొనుము. "విషస్య
విషమౌషధం" బనియు, "వజ్రంవజ్రేణభిద్యతే" యనియు నభి
యుక్తోక్తులు గలవక్కతన నీయంద యీ కార్యభారంబు వెట్టితి
ననపుడు నందికేశ్వరుండు నీళ్లనమలుచుఁ గొండొకసేపేమియు
నుత్తరంబీయనేరక యెట్టకేలకు ధైర్యంబుదెచ్చికొని న ప్రశ్రయం
బుగా నంజలి జోడించి యిట్లు విన్నవించె. 78

చ. పెనగల సైదుమానికెల శీలవతీమణి చారుశీల నా
కనుపుగఁ బూజలన్ సలిపి యర్పణఁజేసినదేమి దింటివే
మని యిప్పుడట్టియాపెకు సపాకృతి యేనొనరింపనేర్తున
న్యనెపసినేని పంపుటయె యుక్తము దేవర విన్నవించితిన్. 79

చ. పదపడి కాలభైరవుని బంపఁదలంచి హరుండు రమ్మురా
మ్మదనుదయింపఁ గర్తమొకఁడబ్బెను నీవిపుడేగి సంది సె
మ్మదపడి యిచ్చినట్టి సిరి మైకముగ్రమ్మిన చాటుశీల యె
ల్లిదములు పాపఁగావలయు లేమికి నిక్కమొనర్చి ప్రేల్మడిన్. 80

ఉ. నాపుడుఁ గాలభైరవుఁడనంగ హరున్నతిఁజేసి పక్కనే
నావిములాఁగి శేగతి సపాకృతిసేయుము ! గాతెలప్పు నా
కావిబుధేంద్రు భార్యయితె నర్పికొనర్పి
త్వేవరు నప్పుడిన్ సలుపఁ జెప్పుము దేవర ! నీకు మ్రొక్కెదన్. 81

చ. అతఁడిటులాడఁ బొమ్మని యనంతరమక్కసి పిల్చి గౌరి పా
ర్వతి వినుమందఁ గార్యపుభరం బఖిలమ్మును వ్యాకరింప నా
సతిగను మొక్క నాకు విది సేయఁగరానిది యాపెకే సపా
కృతి యెటుసేతుఁ బాయసము నెక్కుడు మెక్కితి నాపెపెట్టఁగన్.

ఉ. పిమ్మటఁ జంద్రునిం బిలిచి భీముఁడువేగ సుమంతి కాపుర
మ్మిమ్మెయి నేగి నందియిడె నేమెరుబల్‌సిరి యాసుశీల భా
గ్యమ్మఖిలమ్ముఁ బోవఁదఁపుమా ! యనఁ జందురుఁ డాపెనాను రు
చ్యమ్ములు పెట్టినట్లు తిని యాపెకు సపాకృతిసేయ నేర్తునే ? 83

తే. గీ. ఆంజనేయుని బిల్చి యిట్లనియె నపుడు
హనుమ ! నీవేగి భూలోకమందవంతి
కాపురము కాపురముగాఁగఁ గలిమినెలమిఁ
దూఁగుచును బంగరుయ్యాల నూఁగుచారు
శీలభాగ్యమ్మడంచి వెచ్చెరను రమ్ము. 84

చ. అనపుడు దేవరా! తమకు నన్నెముఁ బున్నెము గోచరించు నే
మని యలబ్రాహ్మణీగృహమునందలి భాగ్యముఁ బోనడంపనేఁ
జనియెద! నాకు నాపెయిదెఁ జాలినయన్ని యపూపముల్; మనం
బున మఱివాని మంచిరుచి పోదిపుడుఁ జా స్మృతి పాడుకొల్పెడిన్. 85

కం. అంత మహాదేవుఁడు వా
క్కాంతఁ దలఁచినంత వచ్చి కావించి నతిన్
వింత ననురమ్మనిన వృ
త్తాంతము సెలవీయుఁడనుడు నభవుఁడు వలికెఁజా. 86

కం. ఉపదేవుఁడనెడి విప్రుని
దపస్వినెఱుఁగుదువకాదె! తద్గేహిని మే
టిపతివ్రత నంది గుఱిచి
తపమొనరిచెనతఁడునిదె నదభ్రంపుసిరుల్. 87

చ. సిరిగొన మీవెఱింగినదె, చెప్పఁగనేటికి! నీకులేనిబల్
గడువములోనుగాఁ గలుగు కానికుచేష్టలు నేర్పునాపె, యా
దురితమడంచు నౌషధము దుర్గతిదక్క మఱొండులేదు నీ
వరిగియవంతి కాపెకది యబ్బునటుల్ పొనరింపు మింతియే. 88

చ. సితిగళుఁడిట్టు లానతిడఁ జిత్తముగొండొక చొప్పియాసర
స్వతిప్రతిచెప్పె నిట్టులని; శంకర! సర్వమెఱింగినన్ గృత
ఘ్నతకొడిగట్టికొమ్మనినఁ గాదనకే గతినిచ్చగింతు! నా
పతియిదెనాకుఁ జల్మిడిని జాలినయంతయు మెక్కిసొక్కితిన్. 89

కం. ఏ మొగముపెట్టుకొని యిపు
డామె సిరి హరింపఁబోదు నభవా! మదిలో
నామెయిడిన చలిమిడిరుచి
యీమెయిజ్ఞాపకము దపులు బుతమింతశివా. 90

వ. అనియంత నాఁగక. 91

ఉ. ఏగుదుఁ గాక నీదు నుడియే నిగమమ్మను బుద్ధిఁ జేసి, త
ద్భృగరిపుఁ బడంచి యిటు చెప్పెర వచ్చెదఁ గాని, నా మొగం
బేగలు పల్గ నంగల రహీనవిభాషణ ! నీకె నా మొగం
బాగుణయూన్యమౌ కతన వారయుసప్తముగాని దీశ్వరా. 92

కం. ఏమిసెల, వేగుమనెదవొ !
యేమనెదో ! నేనెపర్త నీకుఁడ పీవే
ప్రామాణ్యస్థాపకుఁడవు
నామటిమాటాడనోడె నగజాపతియున్. 93

కం. మఱుమాటలేనిభర్తగ
గిరిజాపతి చూచి పలుకె, గిరిజా ! నీవే
చరచరంబని యుఁదేవుని
తరుణీసిరి హరింపు నిర్వదముఁ జపమునన్. 94

చ. ఎలనగపున్ విచారమును నీశ్వరుఁ డమ్మొయిపోఁ పఁ బలుక్కొనో
చిలుకలకొల్కి నా సలుపు చేఁత యె యియ్యది యైనపిండులన్
విలిచి వచింపనేల ! తిలపిష్టము బెల్లము తోడ నాపెన
క్కులికి నివేదనల్ సలిపెఁ గంతము దాఁ దుచించి త్రేపితన్. 95

ఆ. వె. మఱచిపోదమన్న మఱపురాకున్నది
నాకుఁ జిమ్మిలియన నీకుఁ దెలియు
నెంత ప్రీతిగలదొ ! యీపని నీవేగి
చక్కఁ బెట్టుకొనుము దానమిన్న. 96

కం. ఏనొంటి చెప్పెదను విను
వేనినొ బ్రతిమాలుకన్న వెలఁది తనపనిన్
దా నిర్వహించికొనుటయె
ధీవిధుల సమంజసమని తెలుపు చెఱుఁగవే. 97

తే. గీ. ఆపె మొదవీకుఁ గలిగిన దత్యమర్ష
మది సమంజసమే తగినంత హేతు

వున్నకతమున; నితరులు చన్నలాభ
మున్నటులులేదు స్వయమేగు ముత్పలాక్షి. 98

తే. గీ. వెంట రమ్మన్నవచ్చెద నింటిచనుక
నెనుటికిపేగు మేను రావిందువదన!
తిన్నవాఁడ నగుటఁజేసి సన్నుతాంగి
మొగము చెల్లమి నిట్లంటి నగకుమారి? 99

చ. వగచినయట్లు వాఁతిడినవై ఖరి శూలి యిటుల్ వచింప నా
యగజకు జ్ఞప్తికిం దగిలి యాపె పుఁశ్చలిపూజ పుల్గమే
నొగిఁదినియుంటి దానిరుచి యున్నది నేఁటికి నారసజ్ఞ నో
నగపతి! యెట్టులేగుటకు నాకు మొగంబది చెల్లుఁజెప్పవే. 100

ఆ. వె. నిన్ను నన్నెకాదు నిఖిలదేవతల నా
విప్రభార్య యేదొ పేరు పెట్టి
తనుపుచుండు మున్నదనిపె నీపైఁ గూడఁ
దనుపు సంతయును యథార్థమభవ? 101

తే. గీ. ఒక్కటే దుర్గుణంబు గర్వోదుపర్వ
తాధిరోహిణియౌట యీయవగుణంబు
పేక్షసేయఁ దగ్గదికాదు పెద్దదొసఁగు
కావున నుపాయము వచింపు కాలకంఠ! 102

వ. నావుడుఁ బరమేశ్వరుండు పరమేశ్వరి కా పతివ్రతయం దుదయిం చిన యమర్షంబు కృపకు నపరపర్యాయంబ కాని యన్యంబుగాదని సంతసించి యభినందించుచు నిట్లను. 103

చ. అతివరో! నీకు సత్సతులయందలి పేర్మికి సంతసించెనా
మతి; యల బ్రాహ్మణీసతి సమక్షము నీవును నేను నేగి కు
త్సితమిది తప్పిదం బనుచుఁ దెల్పినఁ జాలును జారుశీల జీ
వితమునవెన్నఁ డాదొసఁగువెంటఁ జరింప దిటుల్ వినొనర్తమే. 104

వ. అనుటయు మీచిత్తంబట్ల పౌనర్తపురాక యనియు, శంకరుండు మన మితరరూపంబులతో నటకేగి యుపకరింపుటకంటె స్వస్వరూపంబులతో నేగుటయె యాపె కనుగ్రహంబుచేసినట్లగు నేపుంటిపేని.

కం. ఎవరో వచ్చి వచించిన
నవలా తాపినక నింపనము లాడిన నా
వ్రుప్పుఁబోడి తప్పిదంబున
కుపన్నె రెట్టించినట్లగును మనచెయ్వుల్. 106

వ. పరమపతివ్రతాశిరోమణి నిఖిలదేవతార్చనాసక్తురాలు, నిరంతాతిథ్యభ్యాగత పూజాపరాయణురాలు నగు నాపెకు మనము ప్రత్యక్షదర్శనం బిడుట కేమినందియుమని పార్వతీపరమేశ్వరు లొక్కెడ నాపెకుం బ్రత్యక్షమై యాపె సుగుణమ్ములు ప్రశంసించి యుపనఁటంచి పదింపడి యవగుణంబు నిరూపించి యాగౌనం గిన్నిగుణమ్ములను గళంకంబవి బోధించుటయు నాసుదతి తనదోసంగు నెఱింగి క్షమాపణంబు వేడి మరల నిట్లనియె. 107

చ. అవగుణమొండు నాయెడల నవ్వి యపాకృతిసేయ కెట్టులో
భవదుదయత్కృపాకలన భాగ్యము పండఁగఁజేసె లేపిచో
భవములనెన్నిటన్ బడయఁబాల్పడనేరవి మీదుదర్శనం
బవుటయెటుల్ ఘటించెడి దయామయులానతియుండు శంకరుల్. 108

తే. గీ. మీకనుగ్రహమున్నచో నాకు గుణము
లేవిదోషంబులవమును గానఁబడదు
భవదనుగ్రహమది లేవిపక్షమందు
నాగుణంబేమిసేయు దైన్యహరులార. 109

వ. ఇట్లు సభక్తికంబుగను సయుక్తికంబుగను దమ్మునుతించు నాయమ భక్తికి సంతసించి యాపె యొసంగిన ఫలాదులనారగించి పిల్లజెల్ల

లతో దోసతోటంబలెనలరు నాపె కుటుంబమ్మును నిరామయాయు రారోగ్యభాగ్య సమన్వితంబగునట్లు లాశీర్వచించి యంతర్ధానంబు నొందిరి. చారుశీలయు. 110

చ. సిరికి విభూషణం బతిథిసేవయు గర్వములేమియంచుఁ దా
నెఱిఁగి యదేమొదల్ వినయమెంతయు దంతురితంబుగాఁగ భూ
సురుల సువాసినీ జనులఁజూచిన యంతనరేచి మన్ననల్
జరుపుచు జీవితమ్మును యశస్కరమౌనటు మార్చి వర్ధిలెన్. 111

వ. ఆపెవలన నెఱిఁగి యీ నందికేశ్వర వ్రతంబును బలువురు సాధ్వీమణు లాచరించి బహుభాగ్యాయురారోగ్యంబుల నామరతంపరగా నలరారుచుండిరి. ఇయ్యది నందికేశ్వర వ్రతప్రభావంబు. దీని వినిన వారికిఁ బఠించినవారికిఁ గావ్యముగా రచించినవారికి రచింపఁ బ్రోత్సహించినవారికి నెల్లరకును నిరామయాయురారోగ్యభాగ్యంబుల కెన్నఁటికిని లోటు వాటిల్లదు. ఇయ్యది శిలాక్షరంబని సూతుండు శౌనకాదిమునులకు వక్కాణించె. 112

కం. దేవా! యావత్తైలం
తావద్వ్యాఖ్యగద! దేహదార్ఢ్యముతగ్గెన్
సేవించుచుంటి నిన్నును
నావార్ధక్యమ్ము నీవు నడపుము పేర్మిన్.

ఇది

శ్రీ నందికేశ్వర వ్రతము

సమాప్తము.

బతికి తుదకు వైష్ణవ వ
ద్రతికిన్ సకలంబు మార్చి తత్పరుఁడయ్యెన్. 6

కం. జనకుఁడు లింగార్చకుఁ డ
య్యును వైష్ణవపూజయందు నొక్కింతయు నె
మ్మనమున ద్వేషంబూనఁడు
తనయుండటుగాక శత్రుతంగొనె హరుపై. 7

కం. మారేడు నెడల నైతం
బాఁతేనికొడుకు కనహన మంకూరితమై
యేరేని వోడుము పిల్చెడి
వారది రొండినిడి రాఁగవైరులుగఁ గనున్. 8

ఉ. భూతివిభూతి శబ్దములు బూడిదవాచకతాప్రసిద్ధిఁ బ్ర
ఖ్యాతము లౌకతాన నటఁగల్గు భికారముగూడ ద్వేష్యమై
యాతనికట్టి యక్కరమునంటిన శబ్దములన్ని శత్రుతా
స్యూతములయ్యెనట్టి మధుసూదనభక్తులు లేరు పూర్వులన్. 9

కం. తన ధర్మకర్తృతకు లోఁ
గిన విష్ణ్వాలయములందుఁ గింకరులౌ వా
రిని గుమ్మరులన్ శాసిం
చెనతండు ధరింపుఁడంచు శ్రీచూర్ణంబున్. 10

వ. అట్లు శాసించుటయు స్వకులోచితంబును జిరకాలాభ్యస్తంబును నగు విభూతిధారణంబు త్యజించుటకును గ్రొత్తగా దిరుమణి తిరుచూర్ణములను దాల్చుటకును రోసి తత్కుంభకారకులస్థులును జంగమకులస్థులును నేకాంతమున నొక్కెడకుంజేరి కులవృద్ధు నొకని నధ్యక్షుగా నేమించి తమతమ కష్టసుఖంబులు తలపోసికొనుచు నిట్లు ప్రసంగించికొనిరి. 11

ఉ. పోయినఁ బోవుఁగాక పలుపున్మరియాద, ధరింపవల్సె నా
 యాయతనానఁ బ్రేగునెడ నయ్యది భించినయట్లు తిర్మణిన్
 గాయమునందుఁ జుట్టముసు, గావనివూసితిమేని వృష్టిచే
 పోయెడిఁ గూడుగుడ్డలనుఁ బొక్కపడిన్వలయున్ గుటుంబమున్ 12

కం. పృథివీపీఠమునఁ బుట్టియు
 పథమేని సుపథమునేని ప్రజలునడచుచే
 బుపహితము "యథారాజా,
 తథాప్రజా" యంద్రుగావె తజ్ఞసరేణ్యుల్. 13

తే. గీ. ఇంటిలో మనమెంత ముక్కంటిపూజ
 చేసికొన్న విభూతిని బూసికొన్న
 పేఁడుగనవచ్చెనే। మనవృత్తి విడ్చి
 కొను సుపాయంబు చూచికోఁ జనును ముందుఁ 14

కం. వ్యతిరేకించిన వైష్ణవ
 మతమందలి వారికి మనమాన్యములెల్లన్
 వితగాఁ బోయెడిఁ బిమ్మట
 బ్రతుకుసదెరువులేక బాధపడఁ గావలయున్ 15

చ. మతమునకేమి। యెట్లయినమార్చికొనంజను బేఁడు శైవస
 న్మతమునువీడి వైష్ణవమతమ్మునకేగినయట్లె పూర్వమం
 బితరుల సన్మతమ్మువిడి వేఱొక సన్మతమున్ గ్రహింతమా
 మతమును మంచిదేయతఁ డుమాధవుఁ డీతఁడు మాదపుండగున్. 16

వ. అస్మదుక్తప్రకారంబున కంగీకరించితిరేని మనదు రాష్ట్రయున్న
 జోమంబునకు లేశమ్మును భయపడవలసిన పనియుండదని యుపర
 మించుటయు మఱియొక్క మతావేశంపు జంగముఁడు లేచియి
 ట్లుపన్యసింపదొడంగె. 17

కం. ఆమతమును మంచిదియే
యీమతమును మంచిదెయని నృపుతో మనమి
ష్టామత చిహ్నము బూనిన
చో మఱియొకఁడేఁడు వచ్చుచో నపుడెట్టుల్. 18

వ. ఇతరదేశస్థుల మాటట్టులుండ మన భరత ఖండమ్మునంద యెవరో పీఠస్థులు సమ్మతించిన యాఱుమతంబులు మాత్రముకాక యింకను నెన్నియో మతములు కనుపట్టెడి రాజ్యలక్ష్మికి నొకమతమని కాని యొకనీతి యని కాని జాతియనికాని యడ్డంకి యున్నదని యెవ్వరను కొందురు! మొన్న నెవ్వరోచెప్పఁగా వినియుంటిని. 19

కం. కలదొక సంస్థానము బో
యలదఁట ? యదివచ్చునంట ! అఱువదిలచ్చల్
కలరఁట బ్రాహ్మణవిద్వాం
సులఁ గవులు౯ మంత్రులును యశోధనులందున్. 20

కం. వారలనాగరికత్వము
వారలయందంబు మఱియు వారలచందం
బేరికిలేదఁట ! తచ్ఛ్రం
గారవతులతోడ దీటుగారచ్చరలున్. 21

కం. ఆకారమున్నచోటనె
శ్రీకలుగునటంద్రుగాని శ్రీకలచో నే
ఆకారము గలుగునటం
చేకతన వచింపరాదొ ! యేనిట్లందున్. 22

వ. ఇంతకు నావచించునది యేమనగా ? రాజ్యలక్ష్మి గడియకొక్కని వరించుచుండు వాని మతంబెట్టిదైనను బ్రజలు తన్మత చిహ్నంబులు దాల్చి వర్తింపవలయుననుట అంత యుక్తిసహంబునుగాదు శాస్త్ర సమ్మతంబును గాదని నేననుకొందుఁగావున విహపరంబులురెండును

వ. పదంపడి వాద్యభాండముల నిండఁ దిరుమణి చూర్ణంబులు, ముఖము మొదలు తత్తత్ప్రదేశంబులనెల్లఁ దిరుమణి తిరుచూర్ణంబులునై యేగుటకు రాకొమరుండు సంతసించెం గాని. 29

ఆ. వె. ద్వాదశోర్ధ్వపుండ్రధారణంబది యధః
పుండ్రధారణముగఁ బొల్చుటకును
సందియమ్ము గలిగి సపరిహాసమ్ముగా
నిట్టి వ్యత్యయంబదేమి యనుడు. 30

వ. కుంభకారివృద్ధుండు మెల్లఁగా వణఁకుచు "అతివినయం ధూర్తలక్షణమ్" అను నార్యోక్తికిఁ బ్రధానోదాహరణమ్ముగుచు నిట్లువక్కాణించె.

ఉ. ఏము విభూతిఁ బూసికొనుచో యలవాటగువాండ్ర మద్దియె
ట్లో మెయినిండఁ బూసికొనుచుండెడి వాండ్రము పంగనామముల్
ప్రామికొనంగ నేర్చుటది పైపయినున్నదె। యెంతకాలమో
సామొనరించి నేర్చికొనఁ జక్కఁగఁ గన్పడు నూర్ధ్వపుండ్రముల్.

వ. అని వెండియు. 33

ఉ. దేవరయాగ్రహింపరని దెల్పెద నింకొకమాట వైష్ణవం
బీవిధిఁ దల్లక్రింపగుట కేమి కతంబనఁ జిత్తగింపుమో
భూవర। నేఁటికిట్లు ముదిరిపోయి యిటుల్ గనసయ్యె నంచు మీ
భావమునం దలంపుఁడని ప్రార్థనమున్ బొనరింతు సైఁపఁగన్. 34

వ. నావుడు రాజకుమారుండు మతిమంతుం డగుటంజేసి యందలి వ్యంగ్యార్థంబు గ్రహించి నిగ్రహానుగ్రహమ్ములు తన కరగతంబులుగా నుండియు నధికారంబు దుర్వినియుక్తంబుగాని చందంబున మిన్నకుండె నాయీ వృత్తాంతంబు తత్రత్యులు భృత్యులరిగి నివేదించుటంజేసి వృద్ధభూపాలుండు కుంభకారవృద్ధుని ధైర్యస్థైర్యంబులకును వైదగ్ధ్యమునకును స్వమతాదరమ్మునకును సంతసించి కొమరునకు స్వమత సమాదరంబుగల్గు భాగ్యంబు చేకూరునెడల నీకు

ద్దుండుగూడ దేశములలోఁ జేర్చికోఁదగి యుండునని మిన్నకుండి
రాత్రి విచారించునెడల నిట్లు మనంబున వితర్కించికొనుచు శిష్యుం
దలంచికొనుచు నిద్రించె. 35

ఉ. తాతలుఁ దండ్రి తాతలును దాతలతాతలు వారితండ్రులున్
చేతులనిండ నీదు పదసేవనముం బొనరించి చిత్తముల్
చేతమునిండ నీస్మరణఁజేసి తపించి తరించినారు వి
ఖ్యాతియు భూతియున్ గలిగి యుండుట నిందుకుఁగూడసత్యమై. 36

ఆ. వె. నిన్ను మించినట్టి నిఖిలలోకేశుండు
లేఁడనంగనేల ! లేఖలందుఁ
గలఁడె యంచు మట్లు గల్గిన స్వమతంబు
విడుచుటొప్పుకొనదు విజ్ఞులకును. 37

కం. కొమరునకిదేరి బోధయొ !
కమలాపతియందుఁ గుదిరెఁగదు నాస్థ యదిన్
గుమతంబుగాదు మాన్యము
స్వమతంబును వీడరాదు శంకింతువటే. 38

కం. పలుమతములాగలవన్నియుఁ
దులఁదూచి గ్రహింపఁజాలు పూర్వపుఁదెస్వం
దిలఁ దాతతండ్రులుండిన
యలమతమున నున్నవారి ననరేరు బుధుల్. 39

కం. ఓయి ! "స్వధర్మే నిధనం
శ్రేయ" యటంచున్ వచించె శ్రీకృష్ణుం డా
జ్ఞాయత్తుఁడైన క్రీడికి
వేయేటికి నతనిపల్కు వేదంబకదా ! 40

తే. గీ. అతఁడు నైతము శివభక్తుఁడైన యట్లు
భారతమ్మ వచించుఁగంతారవమున

భవతు. వేఱొండు విధమునఁ బలుకుఁగాక
స్వమతము ద్యజింపనేల। మావాఁడుదేవ. 41

తే. గీ. ఏమిలోపమ్ముగనిపెట్టె నీమతమున
నింతకంటెను దానియం దేగుణమ్ము
వీఁడుగనిపెట్టె నదిగాక ద్వేషమేల।
గలిగెసిద్దాన నీకదితెలియునభవ। 42

కం. స్వమతాసక్తునిగా నా
కొమరుఁ గరుణించి నాదు కొండలవ్వసకున్
శమము ప్రసాదింపుము వం
శము సర్వము త్వత్పదాబ్జ సంసక్తమజా. 43

వ. ఇట్లు పరమేశ్వరుంగూర్చి ధ్యానించుచుఁ దెలనాలుజాముఁవఱకు నిదు
రింపక యప్పుడ యించుక కన్ను మొగుడ్చుటయు. 44

సీ. జటలయుష్ణీషంబు సరిగంచుపాగ క
న్నను వేయిరెట్లు విన్నాణమొలుక
లేఁతచంమరుడాలు నూతనవస్త్రాల
సరిఫేషుకన్న నచ్ఛముగ వెలుఁగ
వ్యాఘ్రచర్మపుశాటి వన్నెచిన్నెలతోడి
పట్టుసేలువుకన్న భా దలిర్పఁ
గరికంఠగత సర్పసురుచిరభూషణా
వళి రత్నములకన్నఁ దళుకుఁగులుక

తే. గీ. స్వచ్ఛపుగు బూదిపూత శీర్షగతమైన
గంగకన్నను దెల్లనికాంతులీన
గరళకంఠుండు కలలోన గరుణతోడ
నల్లభూపాలు నెదుటఁ బ్రత్యక్షమయ్యె. 45

వ. అట్లు ప్రత్యక్షంబై యిట్లు వక్కాణించె. 46

కం. ఈ వెఱిఁగిన సంగతులే
యేవచియింపంగనేల యిరువుర మొకటే
శ్రీవరుఁడు నాకు మిత్రుఁడు
భావింపఁగ నొకరికొకరు బంధులమనఘా. 47

కం. మాలోనలేని భేదము
వేలోకులా తెచ్చిపెట్టి యెందులకకటా!
లోలోఁ గలహింతురు నృప!
చాలననర్థమ్ముఁగూర్పఁజాలెడి నివియున్. 48

కం. నా నామమ్ములకర్థము
ధీనిధియగువాఁడు శ్రీపతికి బొసఁగఁగ వ్యా
ఖ్యానింప నేర్చునటు శ్రీ
జానివి నా కన్వయించుఁ జతురుండేవిన్. 49

తే. గీ. ఇటు లభేదమ్ముగల్గ మాయెడల నీకుఁ
గలుగు చింతకు నేను నిక్కముగ సంత
సంబుగాంచితి స్వమతంబు డాలువిడిచి
చనుట యుక్తంబుగామియు సత్యమనఘ! 50

ఉ. కొమరుఁడు బుద్ధిశాలి యనఁగుం జెలికాఁడొక పంచకుండు స
క్రమముగ బోధసేయక విచారపుధోరణితోడఁ జేసె వి
ష్ణుమతపుబోధ తన్మతపు సూరులలోఁ బలుమంది కిట్టిదో
షముఁ గల దెల్లెడన్; దెలిసి శత్రుతఁగూర్తురు నాదుపట్టునన్. 51

వ. ఇట్లే మద్భక్తులుగూడ మన్మిత్రుండగు రమానాథు నెడల విద్వే
షంబు పుట్టింతురుగాని మద్భక్తులలో నాత్మమతాసక్తియే మెండు
గాని అన్యమతద్వేషబుద్ధి కడుంగడు మృగ్యంబని వెండియు. 52

కం. ఈయెడ నీకొక్కటి నదు
పాయము నేఁ దెల్పువాఁడ నయ్యది కొమరున్

జేయు స్వమతాదరునిగా
నీయెదలో మానుమింక నెగులు సుశీలా ! 53

వ. అయ్యది వినుము. నీవు నీకొమరుని మంతనమ్మున సగౌరవంబుగ సవాత్సల్యంబుగ నొక్క ప్రశ్నమ్మడుగుము దాని కతం డుత్తరంబు వచించు దానితో సకలమ్మును జక్కంబడఁ గలదని యా యుపాయంబు దెలిపి యభవ్యం దంతర్హితుం డగుటయు భూపాలుండు మేల్గాంచి మేలు కలగాంచితినని సంతసించి పదంపడి యొక్కనాఁడు.

చ. ముదిరిన భక్తితో బికిరముఁ గృహపుత్త్రికలీయఁ గొంచు న
య్యది గురువర్యునొద్ద నిడు నాత్మజుపై ఖరిఁ జూచి యేటికి
య్యది ! "తుదకబ్బెరా" యనెడి యార్యుల లౌకికసూక్తికిన్ రమా
స్పదుఁడు కుమారుఁడగ్గమయి పాడతెనంచు విచారమందుచున్. 55

వ. తన మనంబునఁ గల కోపతాపంబుల నణంచికొని సప్రేమంబుగఁ గుమారుం జేరం బిలిచి. 56

కం. ఆగర్భశ్రీమంతుఁడ
వీగతి బికిరంబునెత్తె దేటికి ! నీకే
యాగమము లిట్లు సెప్పె మ
తేగురులు వచించి రించు కెఱిఁగించెదవే ! 57

వ. నాపుడుఁ దండ్రికిఁ గొమరుం డిట్లను "అర్థం ప్రాణమాచార్యాధీనం" బను నభియుక్తోక్తి దీనికిఁ బ్రవర్తకంబు, నేను ఆగర్భశ్రీమంతుఁడ నగుటంజేసియే సాత్త్వికసాత్త్వికభక్తులంబలె నూరంగల గృహమ్ముల కేగి యక్షయపాత్ర సేయక మన నగరునంద జంత్రపుబొమ్మల హస్తమ్ములయందుఁ దండులమ్ములకు బదులు తత్సదృశంబులగు ముత్తియంబులనిడి వానివలన నుపాదానం బొనర్చి యయ్యవి గురునకు సమర్పించుచున్నవాఁడ నియ్యది గురువులొనర్చిన సదుపాయం బని సవినయమ్ముగ నొడువుటయు వృద్ధభూపాలుండు సంతసించుట

నటించి కలలో రాత్రి యీశ్వరోపదిష్టమ్మగు నుపాయమ్ము స్మృతికిం దెచ్చికొని యిట్లనియె. 58

కం. ముదమయ్యె నీదుభక్తికి
సదమలమగు మతము నీకు సంప్రాప్తించెన్
సదయులు నీగురులేముని
యెదరో యీమతమువారి నేగి యడిగెదే. 59

వ. అని వెండియు నీవవ్వారిని బ్రశ్నించునప్పు డియ్యది వైదికమతమా? లేక స్మార్తమతమా? లేక బ్రాహ్మణమతమా? యని చెప్పుమనడిగి వారేమతమని సమాధానమిత్తురో దాని నాకు విన్నది విన్నయట్లు తూ-చా తప్పకుండ వచింపుమనవుడు రాకొమరుడట్ల యగుంగాక యని యడుగుటయు నా గురువు లియ్యది వైదికంబు స్మార్తంబు బ్రాహ్మణంబునుగూడ నగునని ప్రత్యుత్తరంబు వచించిరి యని వచించిన వదంబడి వృద్ధభూపాలుండు కుమారా! నీ కట్టుత్తరంబిడిరి కాని సభాముఖంబున వారల ప్రవృత్తి యేతత్త్రయమ్మునకు భేదంబుగలయదిగాఁ దేలినచో నీవపు డేమి సేతువు నావుడు నృపాలసూతి యిట్లు సమయం బొనర్చె. 60

తే. గీ. వైదికము స్మార్తమునుగాక బ్రాహ్మమేని
గాక యిది యన్యమతమని జ్ఞానఘనులు
వారలే యొప్పుకొన్న నే వారి విడిచి
మనకులాచారమతమున మనలువాఁడ. 61

వ. అట్లొనర్పనినాఁడు బ్రహ్మఘ్నసురాపాయి ప్రముఖదుర్జనులగతి కగ్గమగుదునని సప్రతిజ్ఞంబుగఁ బల్కుటయుఁ దండ్రి సంతసించెఁ బిమ్మట గొంతకాలం బరిగిన పిదప నేదేని యొండు నిమిత్తంబు గల్పించి బ్రాహ్మణులను విజ్ఞులగువారి నేరి రప్పించి వారివారికిఁ బృథక్ప్రదేశంబుల నేర్పఱచి కూర్చుండ నియమించి వేఱువేఱుగ వారల మంతనమ్మునకుఁ బిలిచి. 62

తే. గీ. మిమ్ము నితరుల వేఱుప్రశ్నమ్ములడిగి
తెలిసికొనవలెఁ గావునఁ దివిరి యెవరి
నేమురమ్మన్న వారలే యేగుదెందు
"కలగపులగపు" రాకలు వలదు వినుఁడు. 63

కం. "పిలువని పేరంటమ్ములు"
కలగాపులగములు చిక్కుఁగలిగించెడి ని
మ్ములనెల్లవారి మర్యా
దలు సలుపనెరందటంచుఁ దగఁబిల్పుటయున్. 64

తే. గీ. వెనుకముందనునట్టి విభేదమొందు
దక్కనిడు నీవిలో హెచ్చుతగ్గులుండ
వేమతస్థులఁ బిల్చిన నామతస్థు
లేగుదెంచి కైకొందు మాయిచ్చునీవి. 65

కం. ఇఁకనొకటి యిపుడెనుడి వెద
మెకసక్కెముపలవదిందుకెవరేని యొ
ప్పకయన్యథాచరించినఁ
బ్రకటించిన శిక్షకపుడు పాత్రులె యెరుఁగా. 66

వ. బ్రాహ్మణులేకానిండు వైష్ణవులేకానిండు ద్వైతులేకానిండు, అద్వైతులే కానిండు ఎవ్వరైనను రాజశాసనం బతిక్రమించుటంజేసి దండనార్హులేయని నొక్కి వక్కాణించుటయు నెల్లరును రాజశాసనంబు మనంబుననిడికొని మననయొనర్చుచుఁ దమతమ నియమితస్థానంబులఁ బిలుపునకుఁ బ్రతీక్షించుచుఁ గిక్కురు మనకుండఁ గూర్చుండిరి పిమ్మట నొక్క రాజభటుం డరుదెంచి గంభీర స్వరమ్మున. 67

ఉ. వైదికులార ! రండొరులు వారలమధ్యను జేరకుండు ఛేఁ
దాదరమూనిచూడమియు నాపయి శిక్షయు సంభవించు ము
న్నే దయకల్మిఁ జెప్పెనదియేరును మీరలు విస్మరించి మ
ర్యాదను గోలుపోకుఁడు నృపాజ్ఞయు దేవునియాజ్ఞ వంటిదే 68

వ. నావుడు వైదికపదవాచ్యులగు వారలెల్లరును రాజనికటంబున కరుగ

వారలకు నమస్కారాదికంబులగు సమయోచితకృత్యంబు లొనర్చి యంబరాది బహుమానంబు లొసంగి తేఁడు సమ్మానించి యనిపిన వారలు యథాపూర్వమ్ముగఁ దమ నియమితస్థానంబున కరిగి యుం డిరి. మరల రాజపురుషుం డేతెంచి 69

ఆ. వె. రండు స్మార్తులార ! రాజపరేణ్యుని
యాజ్ఞ మిమ్ముఁ దెచ్చె నన్యులెపుడుఁ
గూడరాదు తేఁడు కోపించు నెఱుఁగుండు
మొదలెమీరుఁ దెచ్చె ముదలవినరె ! 70

వ. అయ్యది విని మున్ను సన్మానింపఁబడినవారలె తాము స్మార్తపద వాచ్యులఁ గూడ నగుటచే నరుగ తేఁడు యథాపూర్వంబుగ సన్మానించుటయు యథాపూర్వమ్ముగఁ గైకొని సంతసింపుచు యథాపూర్వ స్థానమ్ములకరిగియున్న కొండొకసేపునకు మరలరాజపురుషుండు

తే. గీ. రండు బ్రాహ్మణులార ! మీరలు నృపాలు
నాజ్ఞయైనది పేరొక్కరుండుఁ జేర
రాదు మీకిష్టు చెప్పఁబరాదు పదరు
గాక; మీతోడమును చెప్పెఁగాదె ! విభుఁడు. 72

చ. అనవిని బ్రాహ్మణాహ్వయము నందరి వాచ్యమతమ్మె చెప్పటన్
గొనగొన గుంపు గుంపులుగఁ గుంభిని భర్త సమీపభూమికిన్
జనిరల వైదికోత్తములె సత్కృతులఁ దనియించె తేఁడు చ
య్యనఁ దమతొల్లియున్నయెడ కందఱునేగిరి చూరుచుండఁగన్. 73

కం. శ్రీవైష్ణవులాదిగఁగల
భూవిబుధులు తమ్ము రాజపురుషుండిఁక సం
భావించి పిలువఁగలఁడను
భావంబునఁ గూరుచుండఁ బార్థివుఁడంతన్ 74

వ. యువరాజసమేతంబుగా నరుదెంచి నమస్కరించుటయు వారలెల్లరు ససంభ్రమంబుగ లేవంబోవ తేఁడు సగౌరవంబుగ వారి వారించి యిట్లు ప్రశ్నించె. 75

తే. గీ. స్మార్తులా! కారు మీరు బ్రాహ్మణులుఁగారు
కారు వైదికులేని యింక నెవరయ్య!
ఇతరశబ్దముల్ విప్రులనే వచింప
వెఱుఁగరే! యౌగికము లేరినేని చెప్పు. 76

తే. గీ. పంకజాదులవలె రూఢిఁ బరఁగు మూఁడు
శబ్దముల్ వైదికాదులు సర్వసమ్మ
తములు మీరు త్యజించి రుత్తములె యగుదు
రైన నవ్వానిఁ ద్యజియించు టదియు లగ్గె? 77

వ. మాయున్నకడకు మీకెయ్యదియో సందియమ్ము పొడమి రాఁజాల కున్నను మీరును మాకు పాలంబోలెఁ బూజ్యులగుటంజేసి మీసన్నిధికి మేమె వచ్చితిమి కైకొనుండని తాంబూలజాంబూనదాంబరాభరణాదులొసంగి సత్కరించి కొమరునవ్వారికిఁ గేలంజూపి యిట్లనియె.

ఉ. ఈతఁడు చిన్నవాఁడగుట నెవ్వరిబోధనో మీకు శిష్యుఁడై
తాతలనాఁటి వంశపు మతంబటులుండఁ ద్యజించెసర్వ మే
మేతరమందు నెత్తనిది యెత్తెఁజూఁడీ? తిరిపంబు సైతముఱా
వాతులుఁదేని చేయఁడిటు వైష్ణవసత్తములార! వింటిరే! 79

తే. గీ. ముత్తియములేని తండులమ్ము లగునేని
బంగరువె కాని యేదియు భైక్ష్యమకద!
మీరె చెప్పుఁడు మాయయ్య కేరు చెప్పి
రేనియును నచ్చ వెఱిఁగింపుఁ డీరె తగమి. 80

వ. మీమతంబు వైదిక బ్రాహ్మణ స్మార్తంబులయం దేదియని యేను బ్రశ్నింపఁ దాను బై శబ్దంబులు మూఁటికిని బాహ్యంబుకాదని నాతో వాదించిన నేను భగవదాదేశంబున నీయుపాయం బొనర్చి మీచేతన యొప్పించుట తప్పకవచ్చి యిట్లొనర్చితి నియ్యది కొండొక కుయుక్తియని నాయెఱుంగనియది కాదు, అవసరముం బట్టి యవలంబింపవలసెనని వెండియు. 81

చ. నృపసుతుఁ డంతఁ గొంకక దరిద్రులపిల్లఁడు పోవె నాయనా
లిప్పఁబని పూనఁ జేసితిరి రాకొమరుల్గని సవ్వడింత్రు ! యే
వప్పఁబసులంటొనర్చుటకు వైష్ణవధర్మము మాన్పెదు ప్రసే !
కృపణులుదక్క నీ బిరిదమెత్తుదురే ! సతిమెచ్చిప్పష్టసల్. 82

వ. మీరు విలువగల మూర్తినిచ్చుటకు నిగ్రహింపవలెనన పన్నాగంబు గాని యియ్యది పేదాందు గాదని వెండియు. 83

కం. మీరొనరిచిన దియుక్తికి
మారొనరిచి తింతమాత్ర మాన్యత కీలల్
దూరంగులుగారు విషము గా
దూరీకృతమున్ బొనర్చు దుర్విషమెంతుఁగా. 84

వ. అనివారలను సమర్యాదంబుగ ముఁదరించి కొమరుం బ్రోవుగంబై.

కం. ఈవొనరుచు చెట్టను సం
భావించితివే ! యటన్నఁ బార్థివసుతుఁడున్
భావరుతో సదిగో ! సం
భావించితినంచుఁ దంద్రిపకుఁడై చనియెన్. 86

వ. ఇయ్యది యమ్మహేశ్వరుని యనేక లీలావ్రతమ్ముల యందుఁ దులాధారావనవ్రతమ్ము దీనిశ్రవణ మననాదు లఖిల శ్రేయోదాయకంబులని సూతుండు శౌనకాదులకు వక్కాణించె. 87

కం. దేవా ! యాపత్తైలం
తావద్వ్యాఖ్యగద ! దేహదార్ఢ్యముతగ్గెన్
సేవించుచుంటి నిన్నును
నావార్ధక్యమ్ము నీవు నడపుము పేర్మిన్.

ఇది

శ్రీ తులాధారావన వ్రతము

సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# ఏకపత్నీ వ్రతము.

కం. శ్రీలకిర పింద్రకీలము
కైలాసము కృష్ణ గంగగా బెజవాడన్
వాలాయము నివసించెడి
హాలాహలతోఁవ ! మల్లికార్జునదేవా. 1

వ. అవధరింపు మనంతరంబు సూతుండు శౌనకాదులంగని 2

కం. వినియుంటిరి వ్రతములు నే
వినిపింపఁగఁ గొన్నిటిని సవిస్తరముగ నిం
కనువానినే వినుతునో !
వినుతునో యితరమ్ము నాకు వివరింపు డనన్. 3

వ. ముని లిట్లనిరి. 4

కం. భగవంతుని చరిత మ్మెం
దుఁగలదో యది సకలమైన దోసఁగులడఁచి క
ల్గఁగఁజేయు మంగళమ్ముల
నిగమసమానమది యనుచు నీవెఱిఁగినదే 5

కం. కావునఁ బరాత్పరుని లీ
లావిభవమె వినుటకున్ గలదువేడుక మా
భావముల, నింగితజ్ఞుఁడ
వీవెఱుఁగని దొకఁడు గలదె యిందు మతెందుః. 6

వ. ఇట్లు కోరుటయు సూతుండు వేఱొక భగవల్లీలా వ్రతంబున కిట్లుప
క్రమించె. 7

చ. కలదొకపట్టణంబు సిరికాపురమై తగు నాపురమ్మునం
గలరుద్విజుల్ నృపుల్ కడు నఖండధనాఢ్యులు వైశ్యు లంఘ్రిజుల్
గలరు ద్విజన్మలందు శివు గావిలి ప్రాణముగాఁ దలంచి పూ
జలిడెడి లింగధారులు నటుస్రగళాసిక సువ్రతావరుల్. 8

తే. గీ. ఇన్నిపత్తుల దీపమ్ము లిన్నితముల
పాతు లిన్ని పుష్పమ్ములు ప్రతివిధాన
ముసుకుఁ గావలెనను నేమమునరు లోఁగి
వారుపూజింతు రభవు నవ్వారిగాఁగ. 9

ఉ. వారల నిష్ఠలున్ మఱియువారల నేమములున్ గణించి శ
ద్వారము గాచియుండెపరు తప్పరులై నృపులేమి? వైశ్యులే
మీ! రహి యాశుసందుఁగల యెల్లఁ గులీనులుఁగూడ వారల
వ్వారలఁ గాదు నాక భగవంతునిజేస్తు రనుగ్రహించుచున్. 10

కం. ఇతరమతద్వేషములే
క తరించు నుపాయమును దగన్ వార లుమా
పతిపూజావ్రతతత్పర
మతులై బోధింత్రు భక్తిమంతుల కెలమిన్. 11

కం. అల వారికి శివపూజా
ఫలమగు మాద్యత్తురంగ భాస్వత్కరిసం
కులమగు వాఁకిలి సుందర
తలుపీ లసితమ్ము గృహవితతి చెలువారున్. 12

కం. పరమును గూర్చి లేశ
మ్మెఱుఁగని మానవులునయిత మీశ్వరపూజా
దరులై ప్రత్యక్షమహే
శ్వరులని తద్ద్విజుల పూజ సల్పుదురెలమిన్. 13

కం. దానికిఁ దగినట్లుగ సం
తానధనమ్ములును సుఖము దైన్యవిహీనం
బైన మనుగడయు నల యీ
శానుం డవ్వారికిడుచు సతమలరించున్. 14

తే. గీ. అన్ని కాలములు శివభక్తియందుఁ దవిలి
తదనుసరణమ్ముగా సిరుల్ వొదలమెలఁగు
నప్పురంబును బోలు రమాలవాల
మైన పురమొండు గానరాదవని నెందు. 15

ఉ. ఆపురి లింగధారులకు నంచలకుణ్ణ దలమానికంబు వి
ద్యాపరమేష్ఠి నూతనవయస్కుఁడు నిత్యశివార్చనావిధూ
తాపదఘాదిసాంసృతికహానికుఁ డేక సతీవ్రత
స్థాపకుఁ డొక్కనాఁటి నిశి సందెకుఁ గొండొకమీఁదటన్ దగన్. 16

కం. సాయంకాలపు శివపూ
జాయుక్తిన్నెఱపి భుక్తి జరుగకమున్నె
యా యయవారు బజారుకుఁ
బోయెన్ బనియొండుగలిగి పూజ్యుండవలన్. 17

ఆ. వె. అట్లు వెడలి యింటికరుదెంచుచో నొక్క-
వేశ్య యింటినుండి వెడలి నీళ్ళు
శిరమునందుఁ బడియె "శివ! శివా!" యని శివ
దేవు నొడివి యింటితెరువుఁ బట్టె. 18

తే. గీ. పోవుచుండంగ నాయింటి పూవుఁబోఁడి
ధ్వనినిబట్టి యెదో యుపద్రవముగలిగి
యయ్యవారెవ్వరో! అట్టు లభవుని స్మరి
యించి యుందురటంచెంచి యేగిచూచె. 19

వ. చూచునంతట నన్నీరంబు తనయింటి వరవుడపుఁ జెలి యొనరించిన

నధిరోహితుం గావించి బండివానితో నయ్యగారిని భద్రంబుగా వారి యింట డించిరమ్మని కొండొకమేరఁ బాదచారిణియై శకటమ్ము వెంటనరిగి తదాజ్ఞకైకొని యావెలవెలంది యింటిలోనికిన్ జనియెఁ బదంపడి. 25

తే. గీ. అయ్యవారంత నొడలెల్ల నత్తరువుగ
మఱియుఁ బన్నీరుగాఁ బూలమాలికలుగ
నరిగినంతటఁగని యింటియాలియొడలు
భగ్గుభగ్గునమండియుఁ బతికినాపె. 26

తే. గీ. భోజనంబిడి పిదపఁ దాంబూలమిచ్చి
పడకగదిలోనఁ గ్రిందఁజాపపయిదాను
మూఁగవలె నొక్కటఁ బరుండె ముదిత భర్త
విటుఁడనెడి భ్రాంతిగదిరి నిర్విణ్ణయగుచు. 27

తే. గీ. ఆపెహృదయంబు పొడకట్టి యయ్యవారు
గతము సర్వమ్ము వాక్రుచ్చెఁగాని యామె
వినియు నమ్మికలేమిని "ననుము మినుము"
నాక మూకవ్రతము విడలేకయుండె. 28

వ. అట్లు కొన్నిమాసమ్ములుగడిచె నుభయులు నిష్కళంక చరిత్రులు నేకపత్నీవ్రతులలో నాయనకెంత యభినివేశమున్నదియో, యేక పతికవ్రతంబున నాయమకును నంతియ యభినివేశంబు గలిగి యున్నను నిర్హేతుకంబైనను సహేతుకంబట్లు కనుపట్టు కారణం బొకటి యేర్పడి పరస్పరముఖావలోకనమ్ము వినా సంభాషణాది కంబు కలలోసైతమెఱుంగని యప్పుణ్యదంపతులయందు జాలి వొడమి యొకనాఁడు జగదీశ్వరి జగదీశ్వరునకిట్లనియె. 29

తే. గీ. ఎఱుఁగుదురుగాదె ! మీరు దుష్కరతపః ప్ర
శస్తు నలలింగధారి ద్విజాగ్రగణ్యు

నతని భార్యఁ బతివ్రతామహంతరిష్టు
లాప్రశస్తిప్రకృష్టతాస్థాని యనఘ. 30

కం. కొఱగాని ప్రసక్తియెదో
యిరువుర నెడఁబాపె నాపె యిందుకు దోషం
బెఱుగక వెఱఁగ దాయనయును
విరహమునుబవింతు రిట్టివేఁ మిటుపా । కిటా । 31

తే. గీ. అతఁడు దాయన కపరాధమాచరించి
పరమశివభక్తురాలౌర్క ఒడపుపెంఁది
స్నానభోజ్యోపచారముల్ సలిపి పంపె
గౌరవమ్ములరఁగ సట్టి కాంతుఁగాంచి. 32

కం. అత్తరుపాసనపూఁపులఁ
చిత్తమునపవెగటుగొల్ప చిత్తజబాధా
యత్తుఁడయి భర్తవేశ్యా
పత్తికి లోఁబడియెనంచు సాధ్వితలంచెన్ 33

తే. గీ పాపమాగేస్తు నిజము సత్యమెఱిఁగించెఁ
గాని విటులకు సత్యమ్ముగాని కొంచ
కలనగాని యుండదనుచుఁ గలికినష్టు
తురక వర్జించె భర్తతోఁ బరిచయంబు. 34

కం. శివపూజాపరికరములు
సవరించున్ వంటవండి చక్కఁగఁబెట్టున్
ధవునకు లోపముచేయదు
సవరింపదు కాంతుశయ్యపయినెన్నండున్. 35

కం. నగవెఱుఁగదెన్నఁడున్ దన
నగలను ధరియింపదల్ల నాతి తిలక మొ

ప్పుగఁదాల్చు నంతమాత్రమె
నగగావర్తించు నాయనకు మేలునకై. 36

ఆ. వె. కృత్రిమంబు "వడ్లగింజలో బియ్యపు
గింజ" కన్న నెంతకెలికి చూత
మన్నఁ గానఁబడదయన్న్యాయమిది యుపే
క్షింపఁదగమి మీకుఁ జెప్పవలసె. 37

కం. ఇరువురలో నొకరేనియు
దురితము లవమేనెఱుంగుదురె ! పాపంబీ
విరహం బెందుకువారికిఁ
బరమశివాద్వైత నిరతభక్తు లిరువురున్. 38

తే. గీ. భక్తులన బిడ్డలన్న లవంబు భేద
ముండునే ? మనమిట్లూరకుండునెడల
నెవరు వారల సేమంబు నెంచువారు ?
నాఁగఁ బరమేశ్వరుఁడు కరుణామయుండు. 39

కం. పరమంబగు నొక మాహే
శ్వరరూపము దాల్చి యొడలి భస్మరజము దు
ర్భరమగు నెండకు గలిగిన
శరీరఘర్మజలమునకు నగమఱ వెడలెన్. 40

తే. గీ. భస్మరుద్రాక్షధారి విభ్రాజమాన
లింగధారియు వృద్ధు నశికతలాక్షీ
మాత్రమేలేని శివునిగా ధాత్రినెల్ల
వారుఁ గనుచుండి రాయయ్యవారి నెలమి. 41

కం. మును వేశ్యాంగన గౌరవ
మును గని భార్యకు నెడమొగమును బెడమోమౌ
టను-గన్నయతఁడు తనదగు
మనికితమున కతిధిగాఁగ మన్నించి వెసన్. 42

వ. కోడొక్కని చవి యర్ఘ్యాదులచే నర్చించుటయు నతండు సంతుష్టుండై భోజనానంతరము పిరిల రస్యోన్యత గలిగించు టెట్లని యాలోచించి తనయొద్దనున్న మదిసంచిని విప్పి. 43

కం. అందలి కనకకలశ ము౯
విందానన చూచుమెంత విభునకు నిది నే
నెందోచవి వచ్చెద మీ
మందిరమున దీని దాఁచి మఱి నాకిడుఁడా ? 44

వ. అని మఱియు నిద్దాని దాఁచుధారంబు నీస్వైఁగాని నీధాన్యమైఁగాని యుండఁ గూడదనియు మీదంపతులు దీని దాఁపఁటిరమ్ము నెడ బాధ్యులని నొక్కి చెప్పి యొకరిచేఁ బెట్టెలో నుంచించి యొకరిచే నద్దాని బీగము వేయించి వెండియు. 45

చ. ఇటుపురదిక్కు చూచి యిది యే జనియంతయుఁ గర్చుపెట్టి సే
కరణ మొనర్చికొన్న కనకంబునఁజేసిన పాత్ర దీనిలో
భిరము మదీయమున్నయది భద్రముసుండని హెచ్చరించి శం
కరుఁ దరిగెన్ దనంత నెలగా నటుపిమ్మట వచ్చె వెండియుణా. 46

వ. అట్లభ్యాగతుండుగా వచ్చిన యావృద్ధమహేశ్వరు నర్చించి భుజింపఁ జేయునెడఁ దన బంగరు చెంబొకవరి చూచినంగాని తనకుఁ జిత్త స్వాస్థ్యమ్ము గుదురదనియు, నది కుదురని భుక్తి రుచింపదనియు, రుచింపని భుక్తి యొడలఁ బట్టదనియుఁ, బట్టనిచో నది విప్రప్రియో జనం బనియు నేమేమో యుపన్యసించుటయు వాదంపతు లొకరితో నొకరు సంభాషింపని మూఁగనోమున నుంటంజేసి యాయవకోరిక చట్టన నెఱవేర్పరామి వేర్వేఱుగా నాయన కిట్టు లనునయింపఁ దొడంగిరి. 47

కం. కుతపనమయ మనఘా యిదె
అతిక్రమించెదివి భుక్తియది గావింద

ర్పితమగు మీ కనక కలశ
"శతంవిహాయ"యనుసూక్తి స్మరియింపుడనన్. 48

కం. గృహమేధి కిట్టులను నా
యిహము సమస్తమ్ము దీననే గలదె న్నే
బహుమతులు కరఁగిపోసిరి
నహిదీనికిఁ దుల్యమగు కనక మీభువిలో. 49

ఉ. ఈశుధనుస్సునందుఁగల హేమముగీటుకు జంకు నల్ల ల
క్ష్మీశునిపుట్టమందుఁగల హేమము గీటుకు జంకు నల్ల వా
ణీశుని బొజ్జలోనఁ గల హేమముగీటుకు జంకు మీదు న
భ్యాశమునందు నాయిడిన బంగరుసాటి జగానఁగానఁగా. 50

వ. పిమ్మట నమ్మనీషి యిల్లాలిట్లనియె. 51

ఉ. మంచిదియైన హేమమది మంచికి నించుకదీసి పోయినన్
మంచుటయందయెల్లరకు మానసముంట స్వభావసిద్ధ మీ
రించుక తాళుచో విడుదు మే మడిగట్టితిఁ బెట్టెముట్టుకో
నంచితు లీరెఱుంగరె ! సమంజసరీతి భుజింపుఁడిచ్చెదన్. 52

కం. ఇరువురచేతికి నిచ్చితి
రిరువురము బుచ్చికొంటి మిరువురమును సం
సరణపుఁబేటికలో జా
గరూకముగ డాఁచితిమి యిఁకన్ భయమేలా ! 53

వ. మీభోజనంబయిన యుత్తరక్షణమ్మునంద మదివిడిచి మీకలశంబు
మీకిచ్చి మరల మడిగట్టుకొని యేనుభుజించెద నింకను దమరు
సందియమెందులకనియెడి సాధ్వికి నల వృద్ధమాహేశ్వరుండిట్లను. 54

కం. కనకమ్ము సర్వపూజ్యము
కనకముగలవాఁడె యందగాఁడగు వానిన్
గని వలచుజగము వానిఁ
దనూజులాదరముతోఁ గనఁగనెంత్రుమదిన్ 55

కార్యమిది యెవరిదందు ర
హార్యముగా వచ్చి నెత్తిపై గొంగుపడెన్. 69

వ. అని యేమియుఁ బోవక యెవరిపుట్టువారు విప్రోషులమని యెఱిం
గియు సదోషత్వం బనివార్యంబని యెఱుంగుటం జేసి. 70

చ. కనకము వస్త్రవాహనము గాలగకార్పణమిచ్చి మానసుగా
బనిపడునేని యున్నయది భాగ్యవతీతులకు వెఱుంగుడీ
వనము! దినార్ధమిమ్మ గడుపంతట నీట లభించు నెంబు భో
జనమొనరింపుమున్న నలకాంబరిపోయుఁడు పయ్కఁ గ్రుప్పఁ బై. 71

ఆ. వె. భోజనమున కేమి! భోసేసినను బోవఁ
జేయకున్నఁ బోవుఁ జెలియకున్న!
భాజనంబులేమి బాధకంబై నాకు
మెదుక దిగదు నిక్కమిది యెఱుంగు. 72

వ. ఇద్దాని దాఁపఱికంబు మీదంపతులకును నాకును మీగృహమ్మునందలి
పేటికకును దక్క నొరులకుఁ దెలియదు. నీవు పరమపతివ్రతాశిరో
మణివి. నీలోపమువలన నియ్యది వాయమై యుండదనుట శిలాక్ష
రంబు. తప్పైనను నొప్పయినను నీదోషంబు నీభర్తపై నిడుటకు
నామనంబు వెనుదీయకున్న యది యెట్లంటేని. 73

కం. ఈతఁడు వేశ్యాసక్తుం
డోతరుణీ! నీవెఱుంగ వొసఁగెనా! యేమో
యేతన్నికేలి యడుగుము
నీతో నీతండు చెప్పు నేనును విందుఁగా. 74

తే. గీ. అనెడి నుడివిని "శివ! శివా!" యుంచుఁ జెవుల
మూసికొనియె నాగేస్తు నమోనమో య
టంచు వృద్ధవిప్రుండు నీవడిగి చూడు
నీదుభార్య నాపెయె చెప్పు నిక్కమనుచు. 75

తే. గీ. ఆపె వేశ్యానురక్తుఁడవంచు నిన్ను
వదలిపెట్టినయట్టు లివ్వాడనున్న
గేస్తు లనుకొనవింటి నీకీలకంబు
నీవు నీభార్యయును దక్క నెఱుఁగు నెవఁడు. 76

కం. ఇఁటన్నిను వేఱుగ వా
ల్గంటియె వెలివెట్ట నొరులు ఘనుఁడందురె ? మీ
జంట పరస్పరమును వా
కొంటకు మొదలిడినఁ దెలిసికొనఁదగు నిదియున్. 77

వ. పెట్టెలో భద్రపఱచి తాళము వేయు నందనుక నాయెఱిఁగిన యంశమే దీనికి నొరుల సాక్ష్యముతోఁ బనిలేదు గాని. 78

ఉ. పిమ్మట భర్త కన్మొఱఁగిపెట్టియ నీవును గాని నీకు గో
ప్యమ్ముగురీతి నీహృదయబంధుఁడు భర్తయుఁ గాని పెట్టె తా
ళమ్మును దీసియుండపలె లాతుఁలు దొంగలు వేశ్మమందుఁగ
న్నమ్మిడి దూఱినట్టులు వినంబడలేదుగదా ! సతీమణీ ! 79

వ. అక్కతమ్మున మీలో మీరు సంప్రదించుకొన్నచో నిందేమియున్నది "వడ్లగింజలో బియ్యపుగింజ" సొమ్మెట్లును దొంకదు. మీరు నాసొమ్ముఁగలవారే యని నేనెఱింగిన కతన నాకు నధైర్యంబు లవమ్మును లేదుగాని నామూలమ్మున మీయిరువురకుఁ గాని మీలో నొకరికిఁ గాని యీయపవాదు ఘటించుట పుణ్యమునకుఁ బోయిన బాపమ్మెదురగుటకాక మఱేమి ! యని యోర్చినట్లును నోదార్చినట్లును బ్రసంగించు నావృద్ధమాహేశ్వరున కానిషధయోగ్యుం డేకపత్నీ వ్రతుండు గేస్తుం డిట్లు వక్కాణింపఁ దొడంగె. నయ్యా నేనెన్నండు గాని పరస్త్రీ ముఖం బెఱుంగనివాఁడ నయ్యు నొండొక నిమిత్తమ్మున నాభార్య నన్ననుమానించి వెలివెట్టినది. ఆహేతువు మీరు నావలన వినుటకన్న నాపె ముఖమున వినుటయే సమంజసం బనుటయు నామహేశ్వరుండు. 80

ఆ. వె. కావె చెప్పుమనుచు నేఁడు నందున్న
మంచిపెద్దలను సమంచితముగఁ
దెలిసికొందు ననుచుఁ దెలుపతోఁ జెప్పుము
మనుచుఁ బల్కి నాపె యనుపదించె. 81

వ. అయ్యది విని యాకపటమాహేశ్వరుండు గేస్తు దిక్కై నీవు విష్ణో
పివే యైనను నిన్నుమహాసింమెటులో నీభార్య ప్రమాదపడినదని
యనుకొనుట కవకాశమ్ములేదు. వినుండేని, వినుము. 82

ఉ. జారసఖిన్ ధనాంగనను జాడను బోరుచుఁ ద్రాఁగుచుఁ బోతు నె
వ్వారును గీర్తికానపడువారలు గొంపుచుఁ జేర్చరాదు త
ద్ద్వారము కార్యముండినను దాముమ్మఁదొక్కఁగరాదు విక్కమో
తీరు పెఱుంగకున్నఁ గొనితేవలెనే యపకీర్తి ముక్కటా. 83

వ. నీవు నిష్కళంక హృదయుండవే యయ్యును స్వప్నసంఘటనమ్ము
నంజేసి బుద్ధిపూర్వకంబుగాఁ గాకున్నను నాఁడా పెలపెండి గృహ
మ్మున నడుగిడుటయు కాక అపేక్షితంబైనను నావైపత్తిరా లొన
ర్చిన యభ్యంగనాద్యుపచారంబుల నంగీకరించుటయు నీ యెడల
నీభార్య యనుమానించుటకుఁ గారణంబయ్యెనని చెందియు. 84

కం. మీరిరువురు నిర్దుష్టులు
కారేమాత్రమ్ము దొసఁగుగలవారలు మీ
చారిత్రము నే నెఱుఁగుదు
దూఱించుకలేక యిట్లు దుఃఖిల్లుదురే. 85

వ. ఇట్లు మందలించుటయు నాదంపతులు మదిలో నీయువకుడు సర్వ
సామాన్యుండగు మాహేశ్వరుండు గాఁడనియు సాక్షాత్పరమేశ్వ
రుండె కానోపుననియు ననుమానించి అట్లే రాకయున్న నంత భద్ర
మ్మగాదాఁచిన కనకకలశం బగుపడకుంటకు నెన్నిపేల గుండెలుం
డుననియు విశ్వసించికొని యమ్మహాత్ము చరణమ్ములపైఁబడి
గట్టిగా విరోధించుచు. 86

కం. ఏమెన్ని జన్మములనో ।
నోమిననోము ఫలియించె నూనముగా నీ
వా మంచుఁగొండ యల్లుఁడ
వేమని నిజరూప మపనయించుట శంభూ. 87

వ. మా మనఃకాలుష్యమ్మెడలింప ననుగ్రహించుట తెల్లంబయ్యె నీసం
కల్పం బన్యథాకరింప మేమెవ్వరమని వెండియు. 88

ఉ. ఎవ్వనియాజ్ఞదాఁటుటకు సృష్టియొనర్చెడి బ్రహ్మజంకునో ।
యెవ్వనియాజ్ఞదాఁటుటకు నిందిరభర్త మురారి జంకునో ।
యెవ్వనియాజ్ఞ దాఁటుటకు నింద్రముఖామరకోటిజంకునో ।
అవ్విభుఁడీవు వ్యాజమున నంతరితుండవుగాఁగ నేటికిన్. 89

వ. నీనిజస్వరూపంబుఁ జూపించి మాయిడిన భక్ష్యభోజ్యమ్ములు నీవు
నీసతీమణితోడ నారగింపవలయునని ప్రార్థించుటయుఁ బరమేశ్వ
రుం డుమాసహితుఁడై వారలకుఁ బ్రత్యక్షమ్మయి షడ్రసోపేత
మ్మగు విందు నారగించి వారల నాశీర్వదించి వెండియు. 90

కం. మీరలు మదీయభక్తుల
రారాధ్యులు లోకమునకు నాయుర్భాగ్యో
దారులుగ నిట్టివే సం
సారసుఖమ్మనుభవించి శతసమలపయిన్. 91

ఉ. శ్రీరుచిరంబు సంసృతి యశేషము పుత్రులయందుడించి మీ
భారము నాకునై వదలి వత్తురుగాక । మదీయసన్నిధిన్
జేరి సుఖింపఁగాఁ బ్రమథసేవకులం దొకరై చరింత్రుగా
కేరికి నందరాని పదమిచ్చితి మీకిఁక నేమి కావలెన్. 92

వ. ఇట్టు లాదంపతులఁ గృతకృత్యులం బొనరించి పరమేశ్వరుం డంత
ర్థానంబుచేసె. నిద్దాని శ్రవణపఠనాదులచే నాయురారోగ్యభోగభాగ్యం
బులవ్వారిగా నేర్పడుట నిక్కువంబని సూతుండు శౌనకాదుల
కెఱింగించె. 93

## గ్రంథాంతపద్యములు.

కం. దేవా! "యాపత్తైలం
తాపద్వ్యాఖ్య" గద! కవిత దయచేసితి నీ
త్రోవఁ దరియించుటకు నీ
సేవకు మొదలిడితి సాఁగఁజేసితివభవా.

కం. దేవా! "యాపత్తైలం
తాపద్వ్యాఖ్య" యని నే మొదలు పెట్టిన నీ
సేవను నిరంతరాయము
గావించిన నిను నుతింపఁగా నాతరమే?

కం. నాయారోగ్యము సంతా
నాయుర్భాగ్యాదికమ్ము లఖిలమ్మును సు
శ్రీయుక్తమ్ముగ నలుపుచుఁ
బాయవికృపఁ బ్రోచు నీకుఁ బ్రణతులివె! శివా!

గద్య:

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన బాలకలానిధి బాలసరస్వతి
కళాప్రపూర్ణ విద్వత్కవి మహాకవిచక్రవర్తి శతావధాని
ఇత్యాది బిరుదాంకితులును చెన్నరాష్ట్ర ప్రభుత్వ
ప్రప్రథమాంధ్రాస్థాన కవితాపట్టభద్రులును
అగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకట
శాస్త్రి కవివరేణ్య ప్రణీతంబై
తిరుపతి వేంకటీయంబు
నాఁబడు వ్రతకథలు
సమాప్తము.

# ముఖ్య సవరణలు:

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 4 | దైవతాసం | దైవతాంశసం |
| 9 | 7 | గలట్లు | గలట్టి |
| 17 | 17 | పొర్లు | పొర్లు |
| 35 | 11 | గళత్వం | గళీత్వం |
| 39 | 15 | ట్టమటంచు | ట్టమనటంచు |
| 40 | 2 | లభించె | లభియించె |
| 42 | 14 | బాహుబలరుద్రుడు | రుద్రరూపుఁడగుచు |
| 53 | 16 | నని | నవి |
| 53 | 25 | డిక | డికి |
| 83 | 15 | విద్ధి | విద్ది |
| 89 | 24 | శ్రీంఠ | శ్రీకంఠ |
| 93 | 13 | వంద్య | వంధ్య |
| 98 | 25 | డియా | యాడి |
| 110 | 16 | వరించు | వరియించు |
| 120 | 22 | మిదియె | మియె |
| 125 | 7 | నూన్య | న్యూన |
| 136 | 22 | క్రియ | ప్రియు |
| 145 | 6 | రాలిట్లు | రాలుకొన్ని |
| 146 | 7 | టనా | టయునా |
| 164 | 2 | తధ్యం | సత్యం |
| 167 | 11 | వత్ర | వ్రత |
| 182 | 10 | కొమడ | కొమరుఁడ |

166 వ పేజీ 21 వ పంక్తి - ఇట్లు మార్చుకోవలెను.

తే. గీ. అనిన నాంజనేయుని బిల్చి యనియెనిట్లు—

